పోతనామాత్య కృత

# శ్రీ కృష్ణ లీలలు - 2



సంకలనం

భాగవత గణనాధ్యాయి

2022

ఓం సహనావవతు! సహనౌభునక్తు!
సహవీర్యం కరవావహై!
తేజస్వి నావధీతమస్తు! మా విద్విషా వహై!
ఓం శాంతిః శాంతిః శాంతిః!!

ఈశ్వరుడు మనల నిరువురిని రక్షించుగాక! మనల నిరువురను పోషించుగాక! మనము గొప్ప శక్తితో (దివ్యబలముతో) కలసి పని చేయుదుముగాక! అధ్యయనముచే మనమిఋవురము మేధా సంపదను పొందుదుముగాక! మన మొండొరులను ద్వేషింపకుందుముగాక! శాంతి, శాంతి, శాంతి సర్వత్రా వుండుగాక!

శ్రీరామ

# శ్రీకృష్ణ లీలలు - 2

బమ్మెఱ పోతనామాత్యులు



## ప్రార్థన

1-క.

నీవేతల్లివి దండ్రివి

<u>నీ</u>**వే** నా తోడునీడ <u>నీ</u>వే సఖుఁడౌ

నీ**వే**గురుఁడవు దైవము

<u>నీ</u>**వే** నా పతియు గతియు <u>ని</u>జముగ కృష్ణా!

*10.1-1-క.

శ్రీ**కం**ఠచాప ఖండన!

<u>పా</u>**కా**రిప్రముఖ వినుత <u>భం</u>డన! విలస

త్కా**కు**త్స్థవంశమండన!

<u>రా</u>**కేం**దు యశోవిశాల! <u>రా</u>మనృపాలా!

<u>టీక</u>:- శ్రీకంఠచాపఖండన = శ్రీరామ {శ్రీకంఠ చాప ఖండనుడు - శ్రీకంఠుని (శోభాకర కంఠుడు యైన శివుని) చాప (విల్లును) ఖండనుడు (విరిచినవాడు), రాముడు}; పాకారిప్రముఖ వినుత భండన = శ్రీరామ {పాకారి ప్రముఖ వినుత భండనుడు - (పాకాసురుని శత్రువైన ఇంద్రుడు) మున్నగువారి చేత వినుత (పొగడబడిన) భండన (యుద్ధము కలవాడు), రాముడు}; విలసత్కాకుత్థ్స వంశ మండన = శ్రీరామ {విలసత్కాకుత్థ్స వంశ మండనుడు - విలసత్ (ప్రసిద్ధి కెక్కిన) కాకుత్థ్సవంశ (కకుత్థ్స మహరాజ వంశమునకు) మండనుడు (అలంకారమైనవాడు), రాముడు}; రాకేందు యశోవిశాల = శ్రీరామ {రాకేందు యశోవిశాలుడు - రాకేందు (నిండు పున్నమి చంద్రుని) వంటి యశః (కీర్తి) విశాలుడు (విరివిగా కలవాడు), రాముడు}; రామ = రాముడు అనెడి {నిండుపున్నమి చంద్రుని పదహారు కళలు - 1అమృత 2మానద 3పూష 4తుష్టి 5పుష్టి 6రతి 7ధృతి 8శశిని 9చంద్రిక 10కాంతి 11జ్యోత్స్న 12శ్రీ 13ప్రీతి 14అంగద 15పూర్ణ 16పూర్ణామృత}; నృపాల = రాజా.

<u>భావము</u>:- శ్రీరామచంద్ర ప్రభు! నీవు క్షీరసాగరమథన సమయంలో పుట్టిన హాలాహలమును కంఠమున ధరించుట ద్వారా లోకాలు సమస్తమునకు శోభను అనుగ్రహించిన శివుని ధనుస్సు విరిచిన మొనగాడవు. ఇంద్రుడు మొదలైన దేవతలు సైతం కీర్తించేలా యుద్ధం చేసిన వాడవు. ప్రసిద్ధమైన కాకుత్థ్స వంశానికి అలంకారమైన వాడవు. నిండు పదహారు కళల పూర్ణచంద్రుని లాంటి కీర్తి మెండుగా వ్యాపించిన వాడవు. ప్రజలకి ఆనందం పంచే మహారాజువి.

## గోపికలు కృష్ణుని యల్లరి చెప్పుట



10.1-306-వ.

మఱియు నా కుమారశేఖరుండు కపట శైశవంబున దొంగజాడలం గ్రీడింప గోపిక లోపికలు లేక యశోద కడకు వచ్చి యిట్లనిరి.

<u>టీక</u>:- మఱియున్ = ఇంకను; ఆ = ప్రసిద్ధుడైన; కుమారశేఖరుండు = కృష్ణుడు {కుమారశేఖరుడు - పిల్లలో శ్రేష్ఠుడు, కృష్ణుడు}; కపట = మాయా; శైశవంబునన్ = బాల్యమునందు; దొంగ = యాయలు చేయు; జాడలన్ = విధముల; క్రీడింపన్ = విహరిం చుచుండగా; గోపికలు = యాదవస్త్రీలు; ఓపికలు = తాలిములు; లేక = లేనివారై; యశోద = యశోద; కడ = వద్ద; కున్ = కు; వచ్చి = వచ్చి; ఇట్లు = ఇలా; అనిరి = పలికిరి.

<u>భావము</u>:- ఇంకను ఆ మాయామాణవబాలకుడు శ్రీకృష్ణుడు మాయా శైశవ లీలలలో క్రీడిస్తుంటే, గోకులంలోని గోపికలు ఓపికలు లేక, తల్లి యశోదాదేవి దగ్గరకు వచ్చి కృష్ణుని అల్లరి చెప్పుకోసాగారు .

*10.1-307-క.



“బా**లు**రకుఁ బాలు లే వని
<u>బా</u>**లిం**తలు మొఱలుపెట్టఁ <u>బ</u>కపక నగి యీ
బా**లుం** డాలము చేయుచు
<u>నా</u>**ల**కుఁ గ్రేపులను విడిచె <u>నం</u>భోజాక్షీ!

<u>టీక</u>:- బాలురు = పిల్లల; కున్ = కి; పాలు = తాగుటకు పాలు; లేవు = లేవు; అని = అని; బాలింతలు = పసిబిడ్డల తల్లులు; మొఱలుపెట్టన్ = మొత్తుకొనగా; పకపక = పకపక అని; నగి = నవ్వి; ఈ = ఈ; బాలుండు = పిల్లవాడు; ఆలమున్ = అల్లరి; చేయుచున్ = చేస్తూ; ఆల = ఆవుల; కున్ = కు; క్రేపులను = దూడలను; విడిచెన్ = వదలిపెట్టెను; అంభోజాక్షీ = సుందరీ {అంబోజాక్షి - పద్మాక్షి, స్త్రీ}.

<u>భావము</u>:- కలువలవంటి కన్నులున్న తల్లీ! అసలే పిల్లలకి తాగటానికి పాలు సరిపోవటం లే దని పసిపిల్లల తల్లులు గోలపెడుతుంటే, నీ కొడుకు పకపక నవ్వుతూ, వెక్కిరిస్తూ లేగదూడల తాళ్ళువిప్పి ఆవులకు వదిలేస్తున్నాడు చూడవమ్మ.

*10.1-308-క.

ప**డ**ఁతీ! నీ బిడ్డడు మా
<u>క</u>**డ**వలలో నున్న మంచి <u>కా</u>ఁగిన పా లా
ప**డు**చులకుఁ బోసి చిక్కిన
<u>క</u>**డ**వలఁ బో నడిచె నాజ్ఞ <u>క</u>లదో లేదో?

<u>టీక</u>:- పడతీ = ఇంతీ; నీ = నీ యొక్క; బిడ్డడు = పిల్లవాడు; మా = మా యొక్క; కడవల = కుండల; లోన్ = అందు; ఉన్న = ఉన్నట్టి; మంచి = శుభ్రముగ; కాగిన = కాగినట్టి; పాలున్ = పాలను; పడుచులకు = పిల్లలకు; పోసి = తాగించి; చిక్కిన = మిగిలిన; కడవలన్ = కుండలను; పోనడిచెన్ = పగులగొట్టెను; ఆజ్ఞ = అడ్డూ అదుపు; కలదో = ఉన్నవా; లేదో = లేవా.

<u>భావము</u>:- ఓ యశోదమ్మా! నువ్వు గొప్ప పడచుదానివే కాని, నీ పిల్లాడు చూడు;

మా కుండలలో చక్కగా కాగిన పాలు ఉంటే, ఆ పాలను తోటిపిల్లలకు పోసేశాడు, ఆ పైన మిగిలిన కడవలను పగలగొట్టేశాడు. మీ వాడికి భయభక్తులు చెప్తున్నారో, లేదో మరి.

*10.1-309-క.

మీ పాపఁడు మా గృహముల

నా పోవఁగఁ బాలు ద్రావ నగపడ కున్నన్

గోపింపఁ బిన్నపడుచుల

వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ!

టీక:- మీ = మీ యొక్క; పాపడు = పిల్లవాడు; మా = మా యొక్క; గృహములన్ = ఇండ్లలో; ఆపోవగన్ = సరిపడినంత; పాలు = పాలను; త్రావ = తాగుటకు; అగపడకన్ = కనబడకుండా; ఉన్నన్ = ఉండగా; కోపింపన్ = కోపించినచో; పిన్నపడచులన్ = పసిబిడ్డలను; వాపోవగన్ = ఏడ్పించుచు; జిమ్ముకొనుచు = కాలితో ఎగజిమ్ముతో; వచ్చెన్ = వచ్చెను.

భావము:- ఓ యమ్మా! మీ అబ్బాయికి మా యింట్లో తాగటానికి సరిపడగ పాలు కనబడలేదు. దానితో కోపించి పసిపిల్లలను పడదోసుకుంటూ బయటకు వస్తున్నాడు. పసిపిల్లలేమో గుక్కపెట్టి ఏడుస్తున్నారు. మరి నువ్వు ఓ బిడ్డకు తల్లివే కదా ఇదేమైనా బాగుందా చెప్పు.

*10.1-310-మత్త.

పుట్టి పుట్టఁడు నేడు దొంగిలఁ బోయి మా యిలు జొచ్చి తా

నుట్టి యందక ఱోలు పీఁటలు నొక్క ప్రోవిడి యెక్కి చై

పెట్టఁ జాలక కుండ క్రిం దొక పెద్ద తూఁ టొనరించి మీ

పట్టి మీఁగడపాలు చేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ!

టీక:- పుట్టిపుట్టడు = కొత్తగా పుట్టినవాడు; నేడు = ఇవాళ, అప్పుడే; దొంగిలబోయి = దొంగిలించుటకు వెళ్ళి; మా = మా యొక్క; ఇల్లున్ = నివాసమును; చొచ్చి = ప్రవేశించి; తాన్ = అతను; ఉట్టి = ఉట్టి {ఉట్టి - పాలు పెరుగు లాంటివి పిల్లులకు అందకుండుటకై పైన వేళ్ళాడదీసెడి తాళ్ళసాధనము}; అందక = అందకపోవుటచే; ఒక = ఒక; ఱోలున్ = రోటిని {రోలు - ధాన్యాదులను దంచుటకైన గుండ్రటి రాతి లేదా కఱ్ఱ సాధనము}; పీటలు = పీటలు {పీట –

కూర్చొనుటకైన క్రింద కోళ్ళు గల బల్ల, పీటలలో కొన్ని రకాలు నేల పీట, ఎత్తు పీట, ముక్కాలి పీట}; ఒక్క = ఒక; ప్రోవు = పోగులా; ఇడి = పెట్టి; యెక్కి = పైకెక్కి; చై = చెయ్యి; పెట్ట = పెట్టుటకు; చాలకన్ = సరిపోకపోవుటచేత; కుండ = కుండకు; క్రిందన్ = కింద పక్కని; ఒక = ఒకానొక; పెద్ద = పెద్ద; తూటు = కన్నము; ఒనరించి = చేసి; మీ = మీ యొక్క; పట్టి = పిల్లవాడు; మీగడపాలు = మీగడకట్టిన పాలను; చేరలన్ = దోసిళ్ళతో; పట్టి = పట్టుకొని; త్రావెన్ = తాగెను; తలోదరీ = సుందరీ {తలోదరి - తల (పలుచ)నైన ఉదరము కలది, స్త్రీ}.

<u>భావము</u>:- ఓ సన్నకడుపు సుందరీ! యశోదా! మీ వాడు మొన్నే కదా పుట్టాడు. అప్పుడే చూడు దొంగతనాలు మొదలు పెట్టేసాడు. మా యింట్లో దూరాడు. ఉట్టిమీది పాలు పెరుగు అందలేదట. రోళ్ళు, పీటలు ఒకదానిమీద ఇంకోటి ఎక్కించాడు. వాటిమీదకి ఎక్కినా చెయ్యి పెడదామంటే అందలేదట. అందుకని కుండ కింద పెద్ద చిల్లు పెట్టాడు. కారుతున్న మీగడపాలు దోసిళ్ళతో పట్టుకొని కడుపు నిండా తాగేసాడు.

*10.1-311-క.

**ఆడం** జని వీరల పెరు

<u>గో</u>**డ**క నీ సుతుఁడు ద్రావి <u>యొ</u>క యించుక తాఁ

గో**డ**లి మూఁతిం జరిమినఁ

<u>గో</u>**డ**లు మ్రుచ్చనుచు నత్త <u>గొ</u>ట్టె లతాంగీ!

<u>టీక</u>:-ఆడన్ = అక్కడకు; చని = వెళ్ళి; వీరల = వీరి యొక్క; పెరుగున్ = పెరుగును; ఓడకన్ = బెదురులేకుండ; నీ= నీ యొక్క; సుతుండు = పుత్రుడు; త్రావి = తాగి; ఒకయించుక = కొంచెము; తాన్ = అతను; కోడలి = వారి కొడుకుభార్య యొక్క; మూతిన్ = నోటికి; చరిమినన్ = రాయగా; కోడలు = కోడలు; మ్రుచ్చు = చాటుమాటుగా తీసుకొనునది, దొంగ; అనుచును = అనుచు; అత్త = భర్తతల్లి; కొట్టెన్ = కొట్టినది; లతాంగీ = ఇంతి {లతాంగి - లతవంటి దేహము కలామె, స్త్రీ}.

<u>భావము</u>:- లత వలె సున్నితమైన దేహం గల సుందరాంగీ యశోదా! నీ కొడుకు అలా వెళ్ళి, వీళ్ళ ఇంట్లోని పెరుగు శుభ్రంగా తాగాడు. పోతూపోతూ నిద్రపోతున్న వాళ్ళ కోడలి మూతికి కొద్దిగా పెరుగు పులిమాడు. లేచాక అత్తగారు చూసి దొంగతిండి తిందని కోడలిని కొట్టింది.

*10.1-312-క.

వా **రి**ల్లు చొచ్చి కడవలఁ

దో**రం**బగు నెయ్యిఁ ద్రావి తుది నా కడవల్

వీ**రిం**ట నీ సుతుం డిడ

వా**రి**కి వీరికిని దొడ్డ వా దయ్యె సతీ!

టీక:- వారి = వారి యొక్క; ఇల్లున్ = నివాసమును; చొచ్చి = దూరి; కడవలన్ = కుండలలోని; తోరంబు = చక్కటి, గట్టిగా పేరుకొన్నది; అగు = ఐన; నెయ్యిన్ = నేతిని; త్రావి = తాగి; తుదిన్ = చివరకు; ఆ = ఆ; కడవల్ = కుండలను; వీరి = వీరి యొక్క; ఇంటన్ = ఇంటిలో; నీ = నీ యొక్క; సుతుండు = పుత్రుడు; ఇడన్ = పెట్టగా; వారి = వారల; కిన్ = కి; వీరి = వీరల; కిని = కి; దొడ్డ = పెద్ద; వాదు = జగడము; అయ్యెన్ = అయినది; సతీ = ఇల్లాలా.

భావము:- ఓ యిల్లాలా! మీ సుపుత్రుడు వాళ్ళింట్లోకి దూరి ఘుమఘుమలాడే నెయ్యంతా తాగేసి, చివరకి ఆ కుండలు వీళ్ళింట్లో పడేసి పోయాడు. దాంతో వాళ్ళకీ వీళ్ళకీ పెద్ద గొడవ అయిపోయింది తెలుసా?

*10.1-313-క.

"వే**లు**పులఁటె; నా కంటెను

వే**లు**పు మఱి యెవ్వ"రనుచు వికవిక నగి మా

వే**లు**పుల గోడపై నో

హే**లా**వతి! నీ తనూజుఁ డెంగిలిఁ జేసెన్.

టీక:- వేలుపులటె = దేవతలా (ఇవి); నా = నాకు; కంటెను = వేరైన; వేలుపు = దేముడు; మఱిన్ = ఇంకను; ఎవ్వరు = ఎవరున్నారు; అనుచున్ = అనుచు; వికవికన్ = విరగబడి వికవిక అనుచు {వికవిక - విరగబడి నవ్వుటలోని ధ్వన్యనుకరణ}; నగి = నవ్వి; మా = మా యొక్క; వేలుపులగోడ = దేవతలను చిత్రించిన గోడ; పైన్ = మీద; ఓ = ఓహో; హేలావతి = విలాసవతీ; నీ = నీ యొక్క; తనూజుడు = పుత్రుడు; ఎంగిలి = మైల; చేసెను = పరచెను.

భావము:- ఓ యమ్మ! యశోదమ్మ! గొప్పగా నవ్వేవు గాని దీనికేమంటావు. మా యింట్లో దేవతలను చిత్రించిన గోడను చూసి, “వీళ్ళా దేవతలు? నాకంటె వేరె దేవతలు ఎవరున్నారు?” అంటు పకపక నవ్వుతూ నీ కొడుకు గోడమీద ఎంగిలి చేసాడు.

*10.1-314-క.

వెన్నఁ దినఁగఁ బొడగని మా

పిన్నది యడ్డంబు వచ్చి పిఱిఁదికిఁ దివియన్

జన్నొడిసి పట్టి చీఱెనుఁ

జిన్ని కుమారుండె యితఁడు? శీతాంశుముఖీ!

టీక:- వెన్నన్ = వెన్నను; తినగన్ = తింటుండగా; పొడగని =చూసి; మా = మా యొక్క; పిన్నది = చిన్నమ్మాయి; అడ్డంబున్ = అడ్డుపెట్టుటకు; వచ్చి = వచ్చి; పిఱిదికిన్ = వెనుకకు; తివియన్ = లాగగా; చన్ను = స్తనమును; ఒడిసి = అనువుగా; పట్టి = పట్టుకొని; చీఱెను = గీరెను; చిన్ని = చిన్న; కుమారుండె = పిల్లవాడా; ఇతడున్ = ఇతను; శీతాంశుముఖీ = సుందరీ {శీతుంశుముఖి - చంద్రముఖి, స్త్రీ}.

భావము:- చంద్రముఖీ! యశోదమ్మా! మా ఇంట్లోకి చొరబడి నీ కొడుకు వెన్న తింటున్నాడు. అది చూసి మా చిన్నమ్మాయి అడ్డంవెళ్ళి ఇవతలకి లాగింది. మీ వాడు మా పడచుపిల్ల రొమ్ముమీద గోళ్ళతో గీరేసి పారిపోయాడు. చంద్రుళ్ళా వెలిగిపోతున్న ముఖం పెట్టుకొని మరీ చూస్తున్నావు గాని చెప్పవమ్మా! ఇవి పసిపిల్లలు చేసే పనులా.

*10.1-315-క.

ఇమ్మగువ దన్ను వాకిటఁ

గ్రుమ్మరుచోఁ జీరి నిలిపికొని పే రడుగం

గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె

నమ్మా! యీ ముద్దుగుఱ్ఱఁ డల్పుఁడె? చెపుమా.

టీక:- ఈ = ఈ; మగువ = ఇల్లాలు; తన్నున్ = అతనిని; వాకిటన్ = ఇంటి గుమ్మం ముందు; క్రుమ్మరుచోన్ = తిరుగుచుండగా; చీరి = పిలిచి; నిలిపికొని = నిలబెట్టి; పేరున్ = నామమును; అడుగన్ = ఏమిటని అడుగగా; కెంపు = ఎఱ్ఱని; మోవిన్ = పెదవిని; కఱచి = కరచి; వడిన్ = వేగముగా; చనెన్ = వెళ్ళిపోయెను; అమ్మా = తల్లీ; ఈ = ఈ; ముద్దు = మనోజ్ఞమైన; కుఱ్ఱడు = పిల్లవాడు; అల్పుడె = తక్కువవాడా, కాదు; చెపుమా = తెలుపుము.

భావము:- ఈ ఇల్లాలు వాకిట్లోంచి వెళ్తున్న నీ పిల్లాడ్ని పిలిచి నిలబెట్టి పేరు

అడిగింది. మీ వాడు చటుక్కున ఆమె పెదవి కొరికి పారిపోయాడు. ఓ యమ్మో! మీ ముద్దుల కొడుకు తక్కువ వాడేం కాదు తెలుసా.

*10.1-316-క.

చేబంతి దప్పి పడెనని

ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్

మా బిడ్డ జలక మాడఁగ

నీ బిడ్డఁడు వలువఁ దెచ్చె నెలఁతుక! తగునే?

టీక:- చేబంతి = చేతిలో ఆడెడి బంతి; తప్పి = తప్పిపోయి; పడెను = పడిపోయినది; అని = అని; ప్రాబల్యము = దబాయించుట; తోడన్ = తోటి; వచ్చి = వచ్చి; భవనము = మేడ; వెనుకన్ = వెనుక, పెరడులో; మా = మా యొక్క; బిడ్డ = ఆడపిల్ల; జలకమాడగన్ = స్నానము చేయుచుండగా; నీ = నీ యొక్క; బిడ్డడు = పిల్లవాడు; వలువ = గుడ్డ; తెచ్చెన్ = తీసుకు వచ్చేసాడు; నెలతుక = ఇంతి; తగునే = ఇది యుక్తమైనదేనా, కాదు.

భావము:- ఓ యింతి! తన చేతి ఆట బంతి ఎగిరివచ్చి పడిందని దబాయింపుగా మా పెరట్లోకి వచ్చేసాడు. అప్పుడు మా అమ్మాయి స్నానం చేస్తోంది. మీ అబ్బాయి చీర తీసుకొని పారిపోయాడు, ఇదేమైనా బావుందా చెప్పమ్మా యశోదా!

*10.1-317-క.

ఇచ్చెలువఁ జూచి "మ్రుచ్చిలి

యచ్చుగ నుఱికించుకొనుచు నరిగెద; నాతో

వచ్చెదవా?"యని యనినాఁ

డిచ్చిఱుతఁడు; సుదతి! చిత్ర మిట్టిది గలదే?

టీక:- ఈ = ఈ; చెలువన్ = అందగత్తెను; చూచి = చూసి; మ్రుచ్చిలి = దొంగతనముగ; అచ్చుగన్ = చక్కగా; ఉఱికించుకొనుచున్ = లేపుకొని; అరిగెదన్ = పోయెదను; నా = నా; తోన్ = తోటి; వచ్చెదవా = వస్తావా; అని = అని; అనినాడు = అన్నాడు; ఈ = ఈ; చిఱుతడు = చిన్నవాడు; సుదతి = సుందరి {సుదతి - మంచి దంతములు కలామె, స్త్రీ}; చిత్రము = విచిత్రము; ఇట్టిది = ఇలాంటిది; కలదే = ఎక్కడైనా ఉందా, లేదు.

భావము:- ఈ చక్కటామెను "దొంగతనంగా లేవదీసుకుపోతాను, నాతో వచ్చేస్తావా"

అని అడిగాడట మీ చిన్నాడు. విన్నావా యశోదమ్మ తల్లీ! ఇలాంటి విచిత్రం ఎక్కడైనా చూసామా చెప్పు.

*10.1-318-క.

కొడుకులు లేరని యొక సతి

కడు వగవఁగఁ దన్నుఁ మగనిఁగాఁ గైకొనినం

గొడుకులు గలిగెద రని పైఁ

బడినాఁ డిది వినుము శిశువు పనులే? తల్లీ!

టీక:- కొడుకులు = పుత్రులు; లేరు = కలుగలేదు; అని = అనుచు; ఒక = ఒకానొక; సతి = ఇల్లాలు; కడున్ = ఎక్కువగా, మిక్కిలి; వగవన్ = విచారించగా; తన్నున్ = అతనిని; మగనిన్ = భర్త; కాన్ = అగునట్లు; కైకొనిన్ = చేపట్టినచో; కొడుకులు = పుత్రులు; కలిగెదరు = పుట్టెదరు; అని = అని; పైన్ = మీద; పడినాడు = పడ్డాడు; వినుము = విను; శిశువు = పిల్లవాళ్ళ; పనులే = చేతలా ఇవి, కాదు; తల్లీ = అమ్మా.

భావము:- ఓ యమ్మా యశోదా! ఈ విచిత్రం విను. ఓ యిల్లాలు తనకు కొడుకులు లేరే “అపుత్రస్య గతిర్నాస్తిః” అని శాస్త్రం కదా మరి మా గతేంటి అని బాధపడుతుంటే, “నన్ను మొగుడుగా చేసుకో కొడుకులు పుడతారు” అని మీదమీదకి వచ్చాడుట మీ వాడు. ఇవేమైనా పసివాడి పనులా చెప్పు.

అవును అతనేమైనా పసివాడా కాదు సాక్షాత్తు శ్రీమహావిష్ణువే కదా. పరబ్రహ్మస్వరూపు డైన తన్ను భర్తగా స్వీకరించ మని సద్గతులు కలుగుతాయి అని నొక్కి చెప్పే, ఆ కపట శైశవ కృష్ణమూర్తి దొంగజాడల బాల్యచేష్టలను చేస్తున్నాడు

*10.1-319-క.

"తలఁగినదానం దల"మనఁ

దలఁగక యా చెలికి నాన తలయెత్తఁగ "నీ

తలఁగిన చోటెయ్యది"యని

తల యూఁచెన్ నీ సుతుండు తగవె? మృగాక్షీ!

టీక:- తలగినదానన్ = బహిష్టురాలను; తలము = తప్పుకొనుము; అనన్ = అనగా; తలగక

= తప్పుకొనక; ఆ = ఆ; చెలి = ఇంతి; కిన్ = కి; నాన = సిగ్గు; తలయెత్తగ = కలుగునట్లుగా; నీ = నీ యొక్క; తలగిన = తొలగిన; చోటు = చోటు; ఎయ్యది = ఏది; అని = అని; తల = శిరస్సును; ఊచెన్ = ఊపెను; నీ = నీ యొక్క; సుతుండు = పుత్రుడు; తగవె = ఇది ధర్మమేనా. కాదు; మృగాక్షీ = సుందరీ {మృగాక్షి - లేడికన్ను లామె, స్త్రీ}.

భావము:- చక్కని లేడికన్నులవంటి కళ్ళు నీ కున్నాయిలే కాని ఓ యశోదమ్మ! ఇటు చూడు. ఈ అమ్మాయి "బహిష్ఠు అయ్యాను దూరంగా ఉండు" అంటే, నీ పుత్రుడు తప్పుకోడు. పైగా తలూపుతూ "బహిష్ఠు అయిన చోటేది" అని అడిగాడుట. ఈ అమ్మాయేమో పాపం సిగ్గుతో చితికిపోయింది. ఇదేమైనా బావుందా చెప్పు.

*10.1-320-క.

వ్రాలఁగ వచ్చిన నీ సతి

"చూలాలం దలఁగు"మనుడు "జూ లగుటకు నే

మూలంబు జెప్పు"మనె నీ

బాలుఁడు; జెప్పుదురె సతులు? పర్వేందుముఖీ!

టీక:- వ్రాలగన్ = మీదపడుటకు; వచ్చినన్ = రాగా; ఈ = ఈ; సతి = ఇంతి; చూలాలన్ = గర్భిణిని; తలగుము = తప్పుకొనుము; అనుడున్ = అనగా; చూలు = గర్భము; అగుట = కలుగుట; కున్ = కు; ఏ = ఏది; మూలంబు = కారణము; చెప్పుము = చెప్పు; అనెన్ = అన్నాడు; నీ = నీ యొక్క; బాలుడు = పిల్లవాడు; చెప్పుదురె = చెప్తారా; సతులు = ఇల్లాండ్రు; పర్వేందుముఖీ = సుందరీ {పర్వేందుముఖీ - పర్వ (పౌర్ణమినాటి) ఇందు (చంద్రునివంటి) ముఖి (మోముకలామె), స్త్రీ}.

భావము:- ఓ యశోదమ్మా! నీ కొడుకు ఈ ఇల్లాలు ఒళ్ళో కూర్చోడానికి వచ్చేడు. ఈమె "గర్భవతిని దూరంగా ఉండు అంది". " గర్భవతివి కావటానికి కారణం ఏమిటి చెప్పు" అని అడుగుతున్నాడు నీ కొడుకు. సుందరి! ఈ తెలివితేటలకు నిండుపున్నమి నాటి చందమామలా నీమోము వికసించిందిలే. కాని, అలా అడిగితే ఆడవాళ్ళు ఎవరైనా చెప్తారుటమ్మా.

*10.1-321-క.

**మ**గు**వా! నీ కొమరుఁడు మా

<u>మ</u>**గ**వా రటు పోవఁ జూచి <u>మం</u>తనమునకుం

ద**గ**ఁ జీరి పొందు నడిగెను

<u>జ</u>**గ**ముల మున్నిట్టి శిశువు <u>చ</u>దువంబడెనే?

<u>టీక</u>:- మగువా = ఇంతీ; నీ = నీ యొక్క; కొమరుడు = పుత్రుడు; మా = మా యొక్క; మగవారు = భర్తలు; అటున్ = అలా; పోవన్ = వెళ్ళిపోగా; చూచి = చూసి; మంతనమున = రహస్యమున; కున్ = కు; తగన్ = చక్కగా; చీరి = పిలిచి; పొందు = కూడుటను; అడిగెను = అడిగెను; జగములన్ = లోకము లందు; మున్ను = ఇంతకు పూర్వము; ఇట్టి = ఇటువంటి; శిశువున్ = పిల్లవానిని; చదువంబడెనే = ఎక్కడైనా చెప్పబడెనా, లేదు.

<u>భావము</u>:- ఓ ఇల్లాలా! మా మగవాళ్ళు బైటకు వెళ్ళటం చూసి రహస్యం చెప్పాలి దగ్గరకి రా అని పిలిచి, నీ కొడుకు క్రీడిద్దాం వస్తావా అని అడిగాడు. ఇలా అడిగే పసిపిల్లాడు ఉన్నా డని ఇంతకు ముందెప్పుడైనా విన్నామా?
గోపికలు యశోదకి చెప్పిన బాలకృష్ణుని అల్లరి ఇది. ఇక్కడ పాలపర్తి నాగేశ్వర శాస్త్రి గారు చెప్పిన విశేషార్థం చూడండి. అసంభవ నాదుల చేత బ్రహ్మైక్యం భంగపరచే దుర్వృత్తులు లే నప్పుడు, రహస్యమున నా యం దైక్యము గమ్మని పిలిచేడు. (ఉపనిషత్ ప్రమాణం – చిదేవాహం చిదేవత్వం సర్వ మే త చ్చిదేవహి.)

*10.1-322-క.

<u>న</u>మ్మి నిదురబోవ <u>నా</u> పట్టిచుంచు మా

<u>లే</u>ఁగతోఁకతోడ <u>లీ</u>లఁ గట్టి

<u>వీ</u>థులందుఁ దోలె <u>వె</u>లది! నీ కొమరుండు;

<u>రా</u>చబిడ్డఁ డైన <u>అ</u>వ్వ మేలె?

<u>టీక</u>:- నమ్మి = నమ్మకముగా; నిదురబోవన్ = నిద్రపోగా; ఆ = ఆ; పట్టి = చిన్నపిల్ల; చుంచున్ = జుట్టును; మా = మా యొక్క; లేగ = లేగదూడ; తోక = తోక; తోడన్ = తోటి; లీలన్ = విలాసముగా; కట్టి = కలిపి కట్టేసి; వీథులన్ = వీధుల; అందున్ = లో; తోలెన్ = తూలెను (ఆ దూడను); వెలది=పడతి; నీ= నీయొక్క; కొమారుండు=పుత్రుడు; రాచబిడ్డడు = రాకుమారుడు;

ఐనన్ = అయినప్పటికిని; అవ్వ = అల్లరి చేయుట; మేలె = మంచిదా, కాదు.

భావము:-ఓ ఉత్తమురాలా! యశోదమ్మా! నా కొడుకు ఆడి ఆడి అలసి నిద్రపోయాడు. నీ సుపుత్రుడు వచ్చి నా కొడుకు జుట్టును మా లేగదూడ తోకకు కట్టి, దాన్ని వీధు లమ్మట తోలాడు. ఎంత గొప్ప నాయకుడి పిల్లా డైతే మాత్రం ఇంతగా అల్లరి పెట్టవచ్చా.

*10.1-323-క.

నా పట్టి పొట్ట నిండఁగఁ

బై పడి నీ పట్టి వెన్న బానెం డిడినాఁ;

డూపిరి వెడలదు; వానిం

జూపెద నేమైన నీవ సుమ్ము లతాంగీ!

టీక:- నా = నా యొక్క; పట్టి = పిల్లవాని; పొట్ట = కడుపు; నిండగన్ = నిండా; పైపడి = మీద ఎక్కి, బలవంతం చేసి; నీ = నీ యొక్క; పట్టి = పిల్లవాడు; వెన్నన్ = వెన్నను; బానెండు = పెద్ద కుండెడు; ఇడినాడు = పెట్టాడు; ఊపిరి = శ్వాస; వెడలదు = రావటంలేదు; వానిన్ = అతనిని; చూపెదన్ = చూపించెదను; ఏమైనన్ = ఏదైనా ప్రమాదము జరిగితే; నీవ = నీవే బాధ్యురాలవు; సుమ్ము = సుమా; లతాంగీ = సుందరీ.

భావము:- పూతీగెలాంటి చక్కదనాల సుందరాంగీ ఓ యశోదమ్మా! నీ కొడుకు నా కొడుకును పట్టుకొని వాడి పొట్ట నిండిపోయినా వదలకుండా బలవంతంగా బానెడు వెన్న పట్టించేసాడు. వాడికి ఊపిరి ఆడటం లేదు. మా వాడిని తీసుకు వచ్చి చూపిస్తా. ఇదిగో వాడి కేమైనా అయిందంటే నీదే బాధ్యత సుమా.

*10.1-324-క.

తెఱవ యొకతె నిద్రింపఁగ

నెఱిఁ గట్టిన వలువ వీడ్చి నే టగు తేలుం

గఱపించి నీ కుమారుఁడు

వెఱచుచు నది పఱవ నగియె విహితమె? సాధ్వీ!

టీక:- తెఱవ = ఇంతి; ఒకతె = ఒకర్తె; నిద్రింపగన్ = నిద్రపోతుంటే; నెఱిన్ = చక్కగా; కట్టిన = కట్టుకొన్న; వలువన్ = చీరను; వీడ్చి = విప్పి; నేటు = దృఢమైనది; అగు = ఐన; తేలున్ = తేలుచేత; కఱపించి = కరిపించి; నీ = నీ యొక్క; కుమారుడు = పిల్లవాడు; వెఱచుచున్ =

బెదిరిపోతూ; అది = ఆమె; పఱవన్ = పరుగెడుతుండగ; నగియెన్ = నవ్వెను; విహితమె = తెలియునా; సాధ్వీ = అబల.

భావము:- ఒకామె నిద్రపోతుంటే బట్టలు విప్పేసి, నీ కొడుకు ఇంత పెద్ద తేలు తెచ్చి కరిపించాడు. ఆమె బెదిరిపోయి పెద్ద నోరు పెట్టుకొని అరుస్తూ గంతులు వేస్తుంటే మీ అబ్బాయి పకపక నవ్వాడు. ఇదేమైనా బాగుందా తల్లీ! ఎంతో సాధు స్వభావివి కదా నువ్వు చెప్పు మరి.

*10.1-325-క.

నా **కొ**డుకును నా కోడలు

నే**క**తమునఁ బెనఁగ బాము నీతఁడు వైవం

గో**క** లెఱుంగక పాఱినఁ

గూఁ**క** లిడెన్ నీ సుతుండు గుణమె? గుణాఢ్యా!

టీక:- నా = నా యొక్క; కొడుకును = పుత్రుడు; నా = నా యొక్క; కోడలున్ = కొడుకుభార్య; ఏకతమునన్ = ఏకాంతమందు; పెనగన్ = కలియుచుండగా; పామున్ = సర్పమును; ఈతడున్ = ఇతను; వైవన్ = వేయగా; కోకలు = వంటిమీది బట్టలు; ఎఱుంగక = తెలియకుండ; పాఱినన్ = పరుగెట్టగా; కూకలు = కేకలు; ఇడెన్ = పెట్టెను; నీ = నీ యొక్క; సుతుండు = పుత్రుడు; గుణమె = మంచి బుద్ధా ఇది, కాదు; గుణాఢ్య = ఇల్లాలా {గుణాఢ్య - సుగుణములచే ఉత్తమురాలు, స్త్రీ}.

భావము:- నా కొడుకు కోడలు ఏకాంతంలో ఉంటే, నీ కొడుకు వెళ్ళి పాము నొకదానిని వారిమీద పడేసాడు. వంటిమీద బట్టలు లేవని తెలియనంతగా భయపడిపోయి, వాళ్ళు పరుగులు పెడుతుంటే, చూసి హేళనగా కేకలు పెట్టాడు. ఓ యశోదమ్మా! నీవేమో సుగుణాల రాశివి కదా. మరి మీ వాడి గుణ మేమైనా బావుందా చెప్పు.

*10.1-326-ఆ.

తరుణి యొకతె పెరుగుఁ ద్రచ్చుచోఁ దుది వంగి

వెన్నదీయ నొదిఁగి వెనుకఁ గదిసి

మగువ! నీ సుతుండు మగపోఁడుములు చేయ

సాఁగినాఁడు తగదె? జక్కఁజేయ.

టీక:- తరుణి = పడతి {తరుణి - తరుణ వయసు స్త్రీ}; ఒకతె = ఒకామె; పెరుగున్ = పెరుగును; త్రచ్చుచోన్ = చిలుకుతూ; తుదిన్ = ఆఖరున; వంగి = వంగొని; వెన్నన్ = వెన్న; తీయన్ = తీయుచుండగా; ఒదిగి = పొంచి ఉండి; వెనుకన్ = వెనుకవైపు; కదిసి = చేరి; మగువ = ఇంతి; నీ = నీ యొక్క; సుతుండు = పుత్రుడు; మగపోడుములు = పోకిరీ వేషములు; చేయసాగినాడు = చేయుట మొదలు పెట్టాడు; తగదె = ఉచితము కాదు, అవును; చక్కజేయన్ = సరిదిద్దుట.

భావము:-ఓ యమ్మా! ఒక యువతి పెరుగు చిలుకుతోంది. చివరకి వెన్న తీయడానికి వంగింది. నీ కొడుకు వెనక చేరి పోకిరీ పనులు చేయసాగాడు. కొంచం బుద్ధి చెప్పరాదా? స్త్రీ బాలాంధజడోపమా అంటారు కదా అలా ఉండి, పెరుగు అనే జ్ఞానం పేరుకున్న వేదాలు చిలికిచిలికి, వెన్న అనే సారం తీయడానికి ప్రయత్నిస్తే సరిపోదు అని. ఏకాంతిక భక్తి లేనిచో వ్యర్థమని పరమాత్మ వెనుతగిలి మగపోడుమ లనే సరైన పురుషయత్నం చూపుతున్నాడట.

10.1-327-సీ.

కలకంఠి! మా వాడ గరితల మెల్ల నీ-
 పట్టి రాఁగల డని పాలు పెరుగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దన త్రోవఁ-
 జూచుచో నెప్పుడు చొచ్చినాఁడొ?
తలుపుల ముద్రల తాళంబులును బెట్టి-
 యున్న చందంబున నున్న వరయ;
నొక యింటిలోఁ బాడు నొక యింటిలో నాడు-
 నొక యింటిలో నవ్వు నొకటఁ దిట్టు;

10.1-327.1-ఆ.

నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ
పక్షి ఘోషణములు పరఁగఁ జేయు
నిట్లు చేసి వెనుక నెక్కడఁ బోవునో
కాన రాఁడు రిత్త కడవ లుండు.

<u>టీక</u>:- కలకంఠి = పడతి {కలకంఠి - కోకిలవంటి కంఠస్వరము కలామె, స్త్రీ}; మా = మా యొక్క; వాడన్ = పేట, వీధి; గరితలము = స్త్రీలము {గరితలు - ఉత్తమురాండ్రు, స్త్రీలు}; నీ = నీ యొక్క; పట్టి = పిల్లవాడు; రాగలడు = వస్తాడు; అని = భావించి; పాలు = పాలను; పెరుగున్ = పెరుగును; ఇండ్ల = ఇళ్ళ; లోపలన్ = లో; ఇడి = పెట్టి; ఏము = మేము; ఎల్లన్ = అందరము; తన = అతని; త్రోవన్ = దారిలో; చూచుచోన్ = చూస్తుండగా; ఎప్పుడున్ = ఎప్పుడు; చొచ్చినాడొ = దూరాడో; తలుపుల = తలుపుల యొక్క; ముద్రల = గొళ్ళెముల; తాళంబులునున్ = తాళములు; పెట్టి = వేసినవి; ఉన్నన్ = అలానే ఉన్న; చందంబునన్ = విధముగనే; ఉన్నవి = ఉన్నాయి; అరయ = తరచి చూసినను; ఒక = ఒకానొక; ఇంటి = ఇంటి; లోన్ = అందు; పాడున్ = పాటలు పాడును; ఒక = ఒకానొక; ఇంటి = నివాసము; లోన్ = అందు; ఆడున్ = నాట్య మాడును; ఒక = ఒకానొక; ఇంటి = గృహము; లోన్ = అందు; నవ్వున్ = నవ్వుతుండును; ఒకటన్ = ఒకదానిలో; తిట్టున్ = తిడుతుండును; ఒకటన్ = ఒకచోట. వెక్కిరించున్ = వెక్కిరించును; ఒక్కొక్కచోన్ = కొన్ని చోట్ల; మృగ = జంతువుల; పక్షి = పక్షుల; ఘోషణములున్ = అరుపులను; పరగన్ = ప్రసిద్ధముగా; చేయున్ = చేయును; ఇట్లు = ఈ విధముగ; చేసి = చేసిన; వెనుకన్ = తరువాత; ఎక్కడన్ = ఎక్కడకు; పోవునో = వెళ్ళిపోవునో; కానరాడు = కనిపించడు; రిత్త = ఖాళీ; కడవలు = కుండలు; ఉండు = ఉండును.

<u>భావము</u>:- ఓ యశోదమ్మా! మంజులవాణి! మీ వాడు వస్తాడని ఊహించాము. మా వీధిలోని గొల్ల భామలము అందరము తలుపులు అన్ని వేసేసి, గడియలకు తాళాలు బిగించాము. అతను వచ్చే దారిని కాపాలాగా చూస్తునే ఉన్నాం. తలుపులకు వేసిన గొళ్లేలు తాళాలు వేసినవి వేసినట్టే ఉన్నాయి. కాని ఇలా చూసేసరికి ఎలా వచ్చాడో ఎలా దూరాడో మరి ఒకరి ఇంట్లో పాటలు పాడుతున్నాడు. ఇంకొక ఇంటిలో గెంతుతున్నాడు. ఇంకో ఇంట్లో నవ్వుతున్నాడు. మరింకొక ఇంట్లోనేమో తిడుతున్నాడు. ఇంకొక చోటేమో ఎక్కిరిస్తున్నాడు. కొన్ని ఇళ్ళల్లో అయితే పక్షులలా కూతలు జంతువులలా కూతలు కూస్తున్నాడు.. ఇంతట్లోనే ఎలా వెళ్ళిపోతాడో చటుక్కున వెళ్ళిపొతాడు. చూస్తే ఖాళీ కడవలు ఉంటాయి తల్లీ.

10.1-328-క.

కడు లచ్చి గలిగె నేనిం

గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్

బడుగుల వాడలపైఁ బడ

విడుతురె రాకాంత లెందు? విమలేందుముఖీ!

టీక:- కడు = ఎక్కువగా, మిక్కుటమైన; లచ్చి = సంపదలు; కలిగెను = ఉన్నట్లు; ఏనిన్ = అయితే; కుడుతురు = మంచి తిండి తింటారు; కట్టుదురు = మంచి బట్ట కడతారు; కాక = అంతేకాని; కొడుకులన్ = పుత్రులను; నగుచున్ = నవ్వుకొనుచు; బడుగుల = పేదల; వాడలన్ = పేట, వీధి; పైన్ = మీద; పడన్ = పడమని; విడుతురె = వదులుతారా, వదలరు; రాకాంతలు = క్షత్రియపడతులు; ఎందు = ఎక్కడ అయినా; విమలేందుముఖీ = సుందరీ {విమలేందుముఖి - స్వచ్ఛమైన మోము కలామె, స్త్రీ}.

భావము:- నిర్మలమైన మోము గల ఓ యశోదాదేవి! ఎంత భాగ్యవంతులు అయితే మాత్రం. గొప్ప తిండి తింటారు, గొప్ప బట్టలు కట్టుకుంటారు. అంతేకాని రాజవంశపు స్త్రీలు ఎక్కడ అయినా ఇలా పిల్లలను ఊళ్ళోకి పేదల మీద పడి పేదలను వేపుకు తిన మని చిరునవ్వులు నవ్వుతూ పంపుతారా? చెప్పు.

*10.1-329-క.

ఓ యమ్మ! నీ కుమారుఁడు

మా యిండ్లను బాలు పెరుగు మననీ డమ్మా!

పోయెద మెక్కడి కైనను

మా యన్నల సురభులాన మంజులవాణీ!”

టీక:- ఓ = ఓహో; అమ్మ = తల్లి; నీ = నీ యొక్క; కుమారుడు = పుత్రుడు; మా = మా యొక్క; ఇండ్లను = నివాసములలో; పాలున్ = పాలు; పెరుగున్ = పెరుగు; మననీడు = బతకనీయడు; అమ్మా = తల్లీ; పోయెదము = పోతాము; ఎక్కడికైనను = మరింకొక చోటునకు; మా = మా యొక్క; అన్నల = అన్నల (పుట్టింటివారి) యొక్క; సురభులు = గోవులమీద; ఆన = ఒట్టు; మంజులవాణీ = సుందరీ {మంజులవాణి - మృదువుగా మాటలాడెడి యామె, స్త్రీ}.

భావము:- ఓ మంజులవాణీ! యశోదమ్మ తల్లీ! నీ సుపుత్రుడు మా ఇళ్ళల్లో

పాలుపెరుగు బతకనీయ డమ్మా. మెత్తని మాటల మామంచి దానివే కాని. సర్దిపుచ్చాలని చూడకు. మేం వినం. మా అన్నల (పుట్టింటి వారి) యొక్క గోవుల మీద ఒట్టు. ఈ వాడలో మేం ఉండలేం. ఊరు విడిచి పోతాం. మాకు మరో గతి లేదు."

<u>విశే.</u> అవును పాపం. వాళ్ళు అమాయకులైన గోపికలు కదా. వాళ్లెక్కడికి పోతారు? ఎక్కడికీ పోరు. మహా అయితే నాలుగు రోజులు పుట్టిళ్ళకి వెళ్తారు. అందువల్లనే వాళ్ళ అన్నల సురభులు గుర్తుకొచ్చాయి.

## యశోద గోపికల నొడంబరచుట

10.1-330-వ.

అని మఱియు ననేకవిధంబుల బాలకృష్ణుండు చేయు వినోదంబులు దమ యందుఁ జేయు మహాప్రసాదంబు లని యెఱుంగక దూఱుచున్న యట్టి గోపికలకు యశోద యిట్లనియె.

<u>టీక</u>:- అని = అని; మఱియున్ = ఇంకను; అనేక = వివిధ; విధంబులన్ = రకములుగా; బాలకృష్ణుండు = బాలకృష్ణుడు; చేయు = చేసెడి; వినోదంబులున్ = వేడుక పనులు; తమ = వారి; అందున్ = ఎడల; చేయు = చేసెడి; మహా = గొప్ప; ప్రసాదంబులు = అనుగ్రహములు; అని = అని; ఎఱుంగక = తెలియక; దూఱుచున్నయట్టి = తిడుతున్నట్టి; గోపికల = గోపస్త్రీల; కున్ = కు; యశోద = యశోద; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

<u>భావము</u>:- మరికా ఆ కపట శైశవమూర్తి కొంటె కృష్ణమూర్తి దొంగజాడల ఇలా రకరకాల బాల్యచేష్టలను లీలలుగా ప్రదర్శిస్తూ క్రీడిస్తుంటే. తమకు అందిస్తున్న ఆ మహాప్రసాదాలను తెలుసుకోలేక, ఓపికలు నశించిన గోపికలు తిడుతుంటే. యశోదాదేవి వారికి ఇలా చెప్పుతున్నారు.

*10.1-331-క.

"చ**న్ను** విడిచి చనఁ డిట్టటు
<u>నె</u>**న్న**ఁడుఁ బొరుగిండ్ల త్రోవ <u>లె</u>ఱుఁగఁడు నేడుం
గ**న్ను**లు దెఱవని మా యీ
<u>చి</u>**న్ని** కుమారకుని ఱవ్వ <u>చే</u>యం దగునే?

టీక:- చన్ను = చనుబాలుతాగుట; విడిచి = వదలి; చనడు = వెళ్ళడు; ఇట్టట్టు = ఎటుపక్కకి; ఎన్నడున్ = ఎప్పుడు కూడ; పొరుగు = పక్కవారి; ఇండ్లన్ = ఇళ్ళకి; త్రోవలు = దారికూడ; ఎఱుగడు = తెలియనివాడు; నేడున్ = ఇప్పటికి; కన్నులు = కళ్లు; తెఱవని = తెరవనట్టి; మా = మా యొక్క; ఈ = ఈ; చిన్ని = చంటి; కుమారకునిన్ = పిల్లవానిని; అవ్వ = అల్లరి, గొడవ; చేయన్ = చేయుట; తగునే = తగినపనేనా, కాదు.

భావము:- "మా కన్నయ్య చంటాడు నా ఒళ్ళో కూర్చుండి పాలు తాగుతుండటమే తప్ప నన్ను వదలి ఈ పక్కకి ఆ పక్కకి పోడు. పక్కింటికి కూడ దారి తెలియదు. అలాంటి ఈనాటికి సరిగాకళ్ళు తెరవడంరానిపసిగుడ్డును ఇలా అల్లరిపెట్టడం మీకుతగినపనికాదు.

*10.1-332-తే.

అన్య మెఱుఁగఁడు; తన యంత నాడుచుండు;

మంచివాఁ డీత; డెగ్గులు మానరమ్మ!

రామలార! త్రిలోకాభిరామలార!

తల్లులార! గుణవతీమతల్లులార!"

టీక:- అన్యమున్ = ఇతర మైన వేమి, తనకు వేరైనది; ఎఱుగడు = తెలియనివాడు, అసలు లేనివాడు; తనయంతన్ = అతనంటతనే, ఆత్మా; ఆడుచుండున్ = ఆడుకొనుచుండును, రాముడు; మంచివాడు = ఉత్తముడు; ఈతడు = ఇతను; ఎగ్గులు = నిందలు, చాడీలు; మానరు = మానివేయండి; అమ్మ = తల్లి; రామలార = మనోజ్ఞరాళ్ళూ; త్రిలోక = ముల్లోకములను; అభి = మిక్కిలి; రామలార = ఆనందింపజేసే ఇంతులూ; తల్లులారా = మా అమ్మలారా; గుణవతీమ తల్లులారా = సుగుణవంతులలో శ్రేష్ఠులారా.

భావము:- తల్లులల్లారా! మనోజ్ఞమైన మగువల్లారా! ముల్లోకాలకు మోదం కలిగించే ముదితల్లారా! నామాట వినండి. ఇతను ఇతరమైనదేది ఎరుగడు. తనంతట తనే క్రీడిస్తు ఉంటాడు. మా కన్నయ్య ఎంతో మంచివాడు అమ్మలార! సకల సద్గుణవతీ లలామల్లారా! ఇతనిపై అపనిందలు వేయకండమ్మా."తల్లి యశోదాదేవి తన వద్దకు వచ్చి బాలకృష్ణుని అల్లరి చెప్పే గోపికలను సమాధాన పరుస్తోంది.

10.1-333-వ.

అని యశోద వారల నొడంబఱచి పంపి గొడుకుం గోపింపఁజాలక యుండె; నిట్లు.

<u>టీక</u>:- అని = అని; యశోద = యశోద; వారలన్ = వారిని; ఒడంబఱిచి = ఒప్పించి; పంపి = సాగనంపి; కొడుకున్ = పుత్రుని; కోపింపన్ = కోపగించుటకు; చాలక = మనసురాక; ఉండెన్ = ఉండెను; ఇట్లు = ఈ విధముగ.

<u>భావము</u>:- ఇలా ఆ కపట శైశవ కృష్ణమూర్తి దొంగజాడల జేయు బాల్యచేష్టలను చెప్పుకుంటున్న ఓపికలు లేని గోపికలకు యశోదాదేవి నచ్చచెప్పి పంపిది, కాని కొడుకుమీద ఉన్న ప్రేమ వలన కోప్పడలేకపోయింది.

10.1-334-ఉ.

<u>కాం</u>**త**లు దల్లితోఁ దన వి<u>కా</u>రము లెల్ల గణింప భీతుఁ డై
<u>శాం</u>**తు**ని సొంపునం బరమ <u>సా</u>ధుని పెంపున గోలమాడ్కి వి
<u>భ్రాం</u>**తు**ని కైవడిన్ జడుని <u>భం</u>గిఁ గుమారకుఁ డూరకుండె నే
<u>విం</u>**త**యు లేక దల్లి కుచ<u>వే</u>దికపైఁ దల మోపి యాడుచున్.

<u>టీక</u>:- కాంతలు = గోపికలు; తల్లి = తనతల్లి; తోన్ = తోటి; తన = తన యొక్క; వికారములు = వెకిలిపనులు; ఎల్లన్ = అన్నిటిని; గణింపన్ = ఎంచిచెప్పగా; భీతుడు = భయపడుతున్నవాడు; ఐ = అయ్యి; శాంతుని = పరమశాంతస్వభావుని; సొంపునన్ = విధముగ; పరమ = అతిమిక్కిలి; సాధుని = యోగ్యుని; పెంపునన్ = విధముగ; గోల = అమాయకుని; మాడ్కిన్ = వలె; విభ్రాంతుని = నివ్వెరపడినవాని; కైవడిన్ = వలె; జడుని = మందుని; భంగిన్ = వలె; కుమారకుడు = పిల్లవాడు; ఊరకన్ = చడీచప్పుడు చేయకుండ; ఉండెన్ = ఉండెను; ఏ = ఎట్టి; వింతయున్ = కపటము; లేక = లేకుండగ; తల్లి = తల్లి యొక్క; కుచ = స్తనముల; వేదిక = స్థలము; పైన్ = మీద; తల = తలను; మోపి = ఆన్చి; ఆడుచున్ = ఆడుకొనుచు.

<u>భావము</u>:- ఇలా గోపికలు తన తల్లి యశోదకు తను చేసే అల్లరిల పనులు అన్ని ఎంచి మరీ చెప్తుంటే, ఈ కొంటె కృష్ణుడు ఏం మాట్లాడకుండా ఎంతో భయపడిపోయిన వాడిలాగ, ఎంతో నెమ్మదైన వానిలాగ, పరమ సాధు బుద్ధి వానిలాగ, అమాయకపు పిల్లవానిలాగ, నివ్వెరపోయినవానిలాగ, మందుడి లాగ ఊరికే ఉన్నాడు. అసలు ఏమి జరగనట్లు తల్లి ఒడిలో చేరి తల్లి రొమ్ములపై తలాన్చి ఆడుకుంటున్నాడు.

## కృష్ణుడు మన్ను దినె ననుట

10.1-335-వ.

అంత నొక్కనాడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినె నని చెప్పిన యశోద బాలుని కేలు పట్టుకొని యిట్లనియె.

<u>టీక</u>:- అంతన్ = అప్పుడు; ఒక్క = ఒకానొక; నాడున్ = దినమున; బలభద్ర = బలరాముడు; ప్రముఖులు = మున్నగువారు; ఐన = అయిన; గోప = యాదవ; కుమారులు = పిల్లలు; వెన్నుండు = కృష్ణుడు {వెన్నుడు (వి) - విష్ణువు (ప్ర)}; మన్ను = మట్టిని; తినెను = తిన్నాడు; అని = అని; చెప్పినన్ = చెప్పగా; యశోద = యశోద; బాలుని = పిల్లవానిని; కేలు = చేయి; పట్టుకొని = పట్టుకొని; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

<u>భావము</u>:- ఒక రోజున బలరాముడు మొదలైన యాదవ బాలురు కృష్ణుడు మట్టి తిన్నాడు అని యశోదాదేవికి చెప్పారు. అంత ఆ అమాయకపు తల్లి ఆ నెరదంట పాపడిని చెయ్యి పట్టుకొని గదమాయిస్తోంది.

*10.1-336-క.

"మన్నేటికి భక్షించెదు?<br>
<u>మ</u>**న్ని**యమము లేల నీవు <u>మ</u>న్నింపవు? మీ<br>
య**న్న**యు సఖులును జెప్పెద<br>
<u>ర</u>**న్నా!** మ న్నేల మఱి ప<u>దా</u>ర్థము లేదే? "

<u>టీక</u>:- మన్ను = మట్టిని; ఏటికిన్ = ఎందుకు; భక్షించెదు = తింటావు; మత్ = నా యొక్క; నియమములు = ఆంక్షలు, ఆజ్ఞలు; ఏలన్ = ఎందులకు; నీవున్ = నీవు; మన్నింపవు = లెక్కచేయవు; నీ = నీ యొక్క; అన్నయున్ = అన్నయ్య; సఖులునున్ = స్నేహితులు; చెప్పెదరు = చెప్పుతున్నారు; అన్నా = నాయనా; మన్ను = మట్టి; ఏలన్ = ఎందుకు; మఱి = ఇంకేమి; పదార్థము = తినదగిన వస్తువు; లేదే = లేదా ఏమి.

<u>భావము</u>:- "ఏమయ్యా కన్నయ్యా! మట్టెందుకు తింటున్నావు. నే వద్దని చెప్పేవేవి ఎందుకు లెక్క చేయవు. తల అలా అడ్డంగా ఊపకు. అన్న బలరాముడు, స్నేహితులు అందరు చెప్తున్నారు కదా. ఏం ఇంట్లో తినడానికి ఇంకేం లేవా ఏమిటి పాపం."

10.1-337-వ.

అని పలికిన ముగుదతల్లికి నెఱదంట యైన కొడు కిట్లనియె.

<u>టీక</u>:- అని = అని; పలికిన = చెప్పుతున్న; ముగుద = ముగ్ధ యైన, అమాయకురాలైన; తల్లి = తల్లి; కిన్ = కి; నెఱ = మిక్కిలి; దంట =నేర్పరి; ఐన = అయినట్టి; కొడుకున్ = పుత్రుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

<u>భావము</u>:- ఆ ముద్దరాలు అయిన తల్లి యశోదా దేవికి మాయలమారి కృష్ణబాలుడు సమాధానం చెప్తున్నాడు

*10.1-338-శా.

<u>"అ</u>**మ్మా**! మన్ను దినంగ నే శిశువునో? <u>యా</u>ఁకొంటినో? వెఱ్ఱినో?

<u>న</u>**మ్మం** జూడకు వీరి మాటలు మదిన్; <u>న</u> న్నీవు గొట్టంగ వీ

<u>రి</u> **మ్మా**ర్గంబు ఘటించి చెప్పెదరు; కా<u>దే</u>నిన్ మదీయాస్య గం

<u>ధ</u> **మ్మా**ఘ్రాణము జేసి నా వచనముల్ <u>ద</u>ప్పైన దండింపవే."

<u>టీక</u>:- అమ్మా = తల్లీ; మన్నున్ = మట్టిని; తినంగ = తినుటకు; నేన్ = నేను; శిశువునో = చంటిపిల్లాడినా; ఆకొంటినో = ఆకలేసి ఉన్నానా; వెఱ్ఱినో = వెఱ్ఱివాడినా; నమ్మంజూడకు = నమ్మబోకుము; వీరి = వీరి యొక్క; మాటలున్ = పలుకులను; మదిన్ = మనసు నందు; నన్నున్ = నన్ను; నీవున్ = నీవు; కొట్టంగన్ = కొట్టుటకోసము; వీరు = వీరు; ఈ = ఇలాంటి; మార్గమున్ = దారిని; ఘటించి = కూర్చి, కల్పించి; చెప్పెదరు = చెప్పుతున్నారు; కాదేనిన్ = కాకపోయినచో; మదీయ = నా యొక్క; ఆస్య = నోటి; గంధమున్ = వాసనను; ఆఘ్రాణము = వాసనచూచుట; చేసి = చేసి; నా = నా యొక్క; వచనముల్ = మాటలు; తప్పు = అబద్ధమైనవి; ఐనన్ = అయినచో; దండింపవే = శిక్షించుము.

<u>భావము</u>:- "అమ్మా! మట్టి తినడానికి నేనేమైనా చంటిపిల్లాడినా చెప్పు. ఇప్పుడే కదా పాలు తాగాను ఇంకా ఆకలి ఎందుకు వేస్తుంది. లేకపోతే నేనేమైనా అంత వెఱ్ఱివాడినా ఏమిటి మట్టి తినడానికి. నువ్వు నన్ను కొట్టాలని వీళ్ళు కల్పించి చెప్తున్నారు అంతే. కావాలంటే నా నోరు వాసన చూడు. నే చెప్పింది అబద్ధమైతే కొట్టుదుగానిలే. వీళ్ళు చెప్పేమాటలు నమ్మవద్దు"అని చిన్నికృష్ణుడు.

మట్టి ఎందుకు తింటున్నావని దెబ్బలాడుతున్న తల్లి యశోదమ్మకి సర్ది చెప్పి, నోరు తెరిచి చూపించబోతున్నాడు.

## నోటిలో విశ్వరూప ప్రదర్శన

10.1-339-వ.

అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి క్రీడామనుజ బాలకుం డైన యీశ్వరుండు తన నోరు దెఱచి ముఖంబుఁ జూపిన

టీక:- అని = అని; పలికి = చెప్పి; నెయ్యంబున్ = ఇంపుగా; ఆ = ప్రసిద్ధురాలైన; అవ్వన్ = తల్లిని; ఇయ్యకొలిపి = ఒప్పించి; క్రీడా = విలాసార్థము; మనుజ = మానవునిగా అవతరించిన; బాలకుండు = పిల్లవాడు; ఐన = అయినట్టి; ఈశ్వరుండు = భగవంతుడు; తన = తన యొక్క; నోరున్ = నోటిని; తెఱచి = తెరచి; ముఖంబున్ = ముఖమును; చూపినన్ = చూపించగా.

భావము:- అలా కృష్ణుడు తల్లిని మెత్తని మాటలతో శాంతింపజేసాడు. సర్వలోకాలకు ప్రభువైన ఆ లీలామానవ వేషధారి అయిన శైశవకృష్ణుడు తన నోరు తెరిచి తల్లి యశోదాదేవికి చూపించాడు.

10.1-340-క.



ఆ లలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్.

టీక:- ఆ = ఆ; లలితాంగి = సుందరి {లలితాంగి - మృదువైన శరీరము కలామె, స్త్రీ}; కనుంగొనెన్ = చూచెను; బాలుని = పిల్లవాని యొక్క; ముఖము = మోము; అందున్ = అందు; జలధి = సముద్రములు {జలధి - నీటికి నిధి, కడలి}; పర్వత = పర్వతములు {పర్వతము - సంధులు కలది, కొండ}; వన = అడవులు; భూగోళ = భూమండలము; శిఖి = అగ్ని {శిఖి - సిగలు కలది, అగ్ని}; తరణి = సూర్యుడు {తరణి - అంధకారమును తరింపజేయువాడు, సూర్యుడు}; శశి = చంద్రుడు {శశి - కుందేలు గుర్తు ధరించినవాడు, చంద్రుడు}; దిక్పాల =

అష్టదిక్పాలకులు {అష్టదిక్పాలకులు - 1తూర్పు ఇంద్రుడు 2ఆగ్నేయము అగ్ని 3దక్షిణము యముడు 4నైఋతి నిరృతి 5పడమర వరుణుడు 6వాయవ్యము వాయువు 7ఉత్తరము కుబేరుడు 8ఈశాన్యము శివుడు}; ఆది = మొదలగువానికి; కరండము = భరణి; ఐన = అయిన; బ్రహ్మాండంబున్ = విశ్వమంతా {బ్రహ్మాండము - ఒక పెద్ద గుడ్డు ఆకారమున ఉండు భూగోళ ఖగోళాది మొత్తము, విశ్వము}.

భావము:- యశోదామాత ఆ పసివాని నోటిలో సముద్రాలు, పర్వతాలు, అరణ్యాలు మొదలగు వాటిలో భూగోళము; అగ్ని; సూర్యుడు; చంద్రుడు; అష్టదిక్పాలకులు 1తూర్పుకి ఇంద్రుడు, 2ఆగ్నేయానికి అగ్ని, 3దక్షిణానికి యముడు, 4నైఋతికి నిరృతి, 5పడమరకి వరుణుడు, 6వాయవ్యానికి వాయువు, 7ఉత్తరానికి కుబేరుడు, 8ఈశాన్యానికి శివుడు మొదలగు సమస్తముతో కూడి ఉన్న బ్రహ్మాండం మొత్తాన్ని చూసింది.

10.1-341-వ.

కనుంగొని.

టీక:- కనుంగొని = చూసి.

భావము:- యశోద కొడుకు నోటిలో బ్రహ్మాండం చూసి.

*10.1-342-మ.

"**క**లయో! వైష్ణవ మాయయో! యితర సంకల్పార్థమో! సత్యమో!
**త**లఁపన్ నేరక యున్నదాననొ! యశోదాదేవిఁ గానో! పర
**స్థ**లమో! బాలకుఁడెంత? యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
**జ్వ**లమై యుండుట కేమి హేతువొ! మహాశ్చర్యంబు చింతింపఁగన్

టీక:-కలయో = స్వప్నమా; వైష్ణవ = విష్ణుమూర్తి యొక్క; మాయయో = మాయా; ఇతర సంకల్పార్థమో = అసత్యమా, చిత్తభ్రమా {ఇతర సంకల్పార్థము - సరికాని ఆలోచనలవలన కలిగి నది, అసత్యము, చిత్తభ్రమ}; సత్యమో=వాస్తవమా; తలపన్=విచారించ; నేరక = లేక; ఉన్నదాననొ = ఉన్నానేమో; యశోదాదేవిన్=నేనసలుయశోదాదేవిని; కానో=కాదేమో; పర=ఇతరమైన; స్థలమో =ప్రదేశమేమో (ఇది); బాలకుడు=పిల్లవాడు; ఎంత=ఎంతటివాడు; ఈతని=అతని యొక్క; ముఖస్థంబు = ముఖమునం దున్నది; ఐ = అయిన; అజాండంబు = విశ్వము; ప్రజ్వలము = మిక్కిలి, అధికముగా ప్రకాశిస్తున్నది; ఐ = అయ్యి; ఉండుట = ఉండుట; కున్ = కు; ఏమి = ఏమి; హేతువో = కారణమో; మహా = గొప్ప; ఆశ్చర్యంబు = వింత; చింతింపగన్ = విచారించగా.

భావము:- కొడుకు నోటిలో బ్రహ్మాండం చూసి విభ్రాంతురాలైన యశోద ఇలా అనుకోసాగింది
“నేను కలగనటం లేదు కదా? లేకపోతే ఇదంతా విష్ణుమాయేమో? ఇదంతా నా చిత్తభ్రమా? కాకపోతే ఇదే సత్యమా? ఒకవేళ నా బుద్ధి సరిగా పనిచేయటం లేదా? అసలు నేను యశోదను అవునా కాదా? ఇది అసలు మా ఇల్లేనా మరొటా? ఈ పిల్లాడు ఎంత, వీడి నోటిలో బ్రహ్మాండం అంతా వెలుగులు చిమ్ముతూ ఉండటం ఏమిటి? ఇలా ఎలా సాధ్యం? ఆలోచించేకొద్దీ ఇదంతా మహా ఆశ్చర్యంగా ఉంది.

10.1-343-ఆ.

బాలమాత్రుఁడగు సలీలుని ముఖమందు
విశ్వ మెల్ల నెట్లు వెలసి యుండు
బాలు భంగి నితఁడు భాసిల్లుఁ గాని స
ర్వాత్ముఁ డాది విష్ణుఁ డగుట నిజము.”

టీక:- బాల = సామాన్య బాలునికి; మాత్రుడు = సమానమైనవాడు; అగు = ఐన; సలీలుని = లీలతో కూడి ఉన్నవాని; ముఖము = ముఖము; అందున్ = లో; విశ్వము = భువనభాండము; ఎల్లన్ = అంతా; ఎట్లు = ఏ విధముగ; వెలసి = విలసిల్లి; ఉండున్ = ఉండగలదు; బాలున్ = పిల్లవాని; భంగిన్ = వలె; ఇతడు = ఇతను; భాసిల్లున్ = ప్రకాశించును; కాని = కాని; సర్వాత్ముడు = నారాయణుడు {సర్వాత్ముడు - సర్వమునందు (ఆత్మగా) నుండెడి వాడు, విష్ణువు}; ఆదివిష్ణుడు = నారాయణుడు {ఆదివిష్ణుడు - మూలాధారమైన సర్వవ్యాపకుడు, విష్ణువు}; అగుటన్ = ఐ ఉండుట; నిజము = తథ్యము.

భావము:- యశోద కొడుకు నోటిలో బ్రహ్మాండం చూసిన విభ్రాంతిలో ఇంకా ఇలా అనుకుంటోంది.
ఇంత చిన్న పిల్లవాడి నోటిలో, ఈ బ్రహ్మాండం అంతా ఎలా ఇమిడిపోయింది పసివాడిలాగ కనిపిస్తున్నాడు కాని ఇతడు నిజానికి సర్వమునందు ఆత్మరూపంలో ఉండే సర్వాత్మకుడు, ఆదిమూలాధారమైన సర్వవ్యాపకుడు అయిన శ్రీమహావిష్ణువే. ఇదే ముమ్మాటికీ నిజం.”

10.1-344-వ.

అని నిశ్చయించి.

టీక:- అని = అని; నిశ్చయించి = నిర్ణయించుకొని.

భావము:- ఇలా యశోదాదేవి ఈ కృష్ణబాలుడు సాక్షాత్తు ఆ మహావిష్ణువే అని నిశ్చయించుకొని .

10.1-345-ఆ.

"ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు

గానఁబడిన బుద్ధి కంప మయ్యె

నా మహాత్ము విష్ణు నఖిలలోకాధారు

నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు.

టీక:- ఏ = ఏ; మహాత్మున్ = గొప్పవాని; వలనన్ = వలన; ఈ = ఈ; విశ్వ = భువనభాండము యొక్క; రూపంబున్ = స్వరూపము; కానబడినన్ = కనబడుటచేత; బుద్ధి = మనసు; కంపము = చలించినది; అయ్యెన్ = అయినది; ఆ = అట్టి; మహాత్మున్ = గొప్పవానిని; విష్ణున్ = నారాయణుని; అఖిల = సమస్తమైన; లోక = భువనములకు; ఆధారున్ = ఆధారభూతుని; ఆర్తులు = పీడలు, దుఃఖములు; ఎల్లన్ = అన్నిటిని; పాయన్ = తొలగించుకొనుటకు; ఆశ్రయింతు = కొలచెదను.

భావము:- ఇలా ఈ నోటిలో విశ్వదర్శనం ఇచ్చిన కృష్ణబాలుడు సాక్షాత్తు ఆ మహావిష్ణువే అని నిశ్చయించుకొనిన యశోదాదేవి ఇలా స్తోత్రం చేస్తోంది. .

"విష్ణుమూర్తి అన్ని లోకాలకు ఆధారంగా నిలబడినవాడు. ఈ బ్రహ్మాండం అంతటా వ్యాపించి ఉన్న ఆ మహాత్ముడైన విష్ణువు వల్లనే నాకు ఈ విశ్వరూపం కనబడింది. నా బుద్ధి చలించిపోయింది. నా దుఃఖాలన్నీ పోవడానికి ఆ మహా విష్ణువునే శరణు కోరుతాను.

10.1-346-క.

నా **మ**గడు నేను గోవులు

నీ **మం**దయు గోపజనులు ని బ్బాలుని నె

మ్మో**ము**న నున్న విధముఁ గని

యే**మ**ఱితిమి గాక యీశుఁ డితఁడు మాకున్".

<u>టీక</u>:- నా = నా యొక్క; మగడు = భర్త; నేనున్ = నేను; గోవులున్ = పశువులు; ఈ = ఈ; మందయున్ = పల్లె; గోపజనులును = యాదవులు; ఈ = ఈ; బాలుని = పిల్లవాని; నెఱ = నిండైన; మోమునన్ = ముఖము నందు; ఉన్న = ఉన్న; విధమున్ = విధానమును; కని = చూసి; ఏమఱితిమి = భ్రమ పడితిమి; కాక = తప్పించి; ఈశుడు = భగవంతుడు; ఇతడున్ = ఇతను; మా = మా అందరి; కున్ = కి.

<u>భావము</u>:- "ఈ బాలకుని నిండు ముఖము నందు నేను, నా భర్త, గోవులు, గోపగోపికా జనులు, ఈ వ్రేపల్లెలో ఉన్న మేమందరము ఉన్నతీరు కనుగొని ఏమరుపాటు చెందాము(ను) తప్పించి, ఇతడు సాక్షాత్తు మా కందరికీ ప్రభువైన ఈశ్వరుడు" అని యశోదాదేవి భావించసాగింది.

10.1-347-వ.

అని తన్ను పరమేశ్వరుండని తలంచుచున్న యశోద యందు నా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన.

<u>టీక</u>:- అని = అని; తన్ను = అతనిని; పరమేశ్వరుండు = భగవంతుడు; అని = అని; తలంచుచున్ = ఎంచుచున్నట్టి; యశోదన్ = యశోద; అందున్ = ఎడల; ఆ = ఆ; కృష్ణుండు = కృష్ణుడు; వైష్ణవ = విష్ణుమూర్తి యొక్క; మాయన్ = మహిమను; పొందించినన్ = కలిగించగా.

<u>భావము</u>:- బాలకృష్ణుడు ఇలా తనను భగవంతుడైన శ్రీమహావిష్ణువుగా భావిస్తూ ఉన్న యశోదకు మళ్ళీ వైష్ణవమాయను ఆవరింపజేశాడు

10.1-348-క.

జడనుపడి యెఱుక చెడి యా
<u>ప</u>డతుక సర్వాత్ముఁ డనుచుఁ <u>బ</u>లుకక యతనిం
గొడుకని తొడపై నిడుకొని
<u>క</u>డు వేడుకతోడ మమతఁ <u>గా</u>వించె నృపా!"

<u>టీక</u>:- జడనుపడి = మూఢత్వములో పడిపోయి; ఎఱుక = జ్ఞానము; చెడి = పోయి; ఆ = ఆ; పడతుక = పడతి; సర్వాత్ముడు = విష్ణుమూర్తి; అనుచున్ = అనుచు; పలుకక = అనకుండా; అతనిన్ = అతనిని; కొడుకు = పుత్రుడు; అని = అని; తొడ = ఒడి; పైన్ = మీద; ఇడుకొని = పెట్టుకొని; కడు = మిక్కిలి, అధికమైన; వేడుక = కుతూహలము; తోడన్ = తోటి; మమతన్ =

ప్రీతి; కావించెన్ = చేసెను; నృపా = రాజా.

<u>భావము</u>:- పరీక్షిన్మహారాజా! ఆ మాయా ప్రభావంవలన యశోద మోహం చెంది, బాలకృష్ణుడు సర్వాత్ముడే అనే విషయం మరచిపోయింది. అతడు తన కొడుకే అనుకుంటూ ఒడిలో కూర్చోబెట్టుకొని చక్కగా ముద్దులాడింది"

## నంద యశోదల పూర్వజన్మ

10.1-349-వ.

అనిన విని రా జిట్లనియె.

<u>టీక</u>:- అనినన్ = అనగా; విని = విని; రాజు = పరీక్షిత్తు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

<u>భావము</u>:- ఇలా శుకమహర్షి యశోద బాలకృష్ణుని ముద్దు చేస్తోంది అని చెప్పగా విని పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

10.1-350-ఆ.

"<u>జ</u>గదధీశ్వరునకుఁ <u>జ</u>న్నిచ్చు తల్లి గా

<u>నే</u>మి నోము నోఁచె <u>నీ</u> యశోద?

<u>పు</u>త్రుఁ డనుచు నతనిఁ <u>బో</u>షించు తండ్రి గా

<u>నం</u>దుఁ డేమి జేసె? <u>నం</u>దితాత్మ!



<u>టీక</u>:- జగదధీశ్వరున్ = హరి {జగదధీశ్వరుడు - జగత్ (లోకము) లన్నిటికి అధీశ్వరుడు (సర్వోత్కృష్ట అధిపతి), విష్ణువు}; కున్ = కి; చన్ను = చనుబాలు; ఇచ్చు = తాగించెడి; తల్లి = అమ్మ; కాన్ = అగుటకు; ఏమి = ఎట్టి; నోమున్ = నోములను; నోచెన్ = చేసెనో; ఈ = ఈ; యశోద = యశోద; పుత్రుడు = కుమారుడు; అనుచున్ = అంటూ; అతనిన్ = అతనిని; పోషింపన్ = పెంచుటకు; తండ్రి = తండ్రి; కాన్ = అగుటకు; నందుడు = నందుడు; ఏమి = ఎట్టి (పుణ్యములు); చేసెన్ = చేసెను; నందితాత్మ = శుకయోగి {నందితాత్మ - ఆనందమున ఉన్న ఆత్మ కలవాడు, శుకుడు}.

<u>భావము</u>:- శుకమహర్షి! నీవు ఆత్మానందం పొందిన వాడవు. ఈ లోకాలన్నిటికీ ప్రభువూ భగవంతుడూ అయిన శ్రీకృష్ణునికి పాలిచ్చి పెంచే తల్లిగా జన్మించడానికి యశోదాదేవి పూర్వజన్మలలో ఏమి నోములు నోచిందో? శ్రీహరిని పోషించే తండ్రిగా పుట్టడానికి నందగోపుడు ఏమి తపస్సులు చేసాడో?

10.1-351-క.

ప్రబ్బిన భక్తిని హరిపైఁ

<u>గ</u>**బ్బం**బులు చెప్పి కవులు <u>కై</u>వల్యశ్రీ

క**బ్బు**దు రట! హరిపోషణ

<u>మ</u>**బ్బి**న తలిదండ్రు లెచటి <u>క</u>బ్బుదురో? తుదిన్."

<u>టీక</u>:- ప్రబ్బిన = సందడించు; భక్తిని = భక్తితో; హరి = విష్ణుమూర్తి; పైన్ = మీద; కబ్బంబులున్ = కావ్యములు {కావ్యము (ప్ర) – కబ్బము (వి)}, కవిత్వము; చెప్పి = రచియించి; కవులున్ = పండితులు; కైవల్యశ్రీ = మోక్షసంపద; కిన్ = కున్; అబ్బుదురు = చెందుదురు; అట = అంటారు; హరి = శ్రీహరి యొక్క; పోషణమున్ = పెంచుట; అబ్బిన = లభించిన; తలిదండ్రులు = తల్లిదండ్రులు; ఎచటి = ఎంతగొప్పపదమున; కిన్ = కు; అబ్బుదురో = పొందెదరు; తుదిన్ = చివరకు.

<u>భావము</u>:- కవీశ్వరులు ఎంతో భక్తితో శ్రీమహావిష్ణువు మీద కావ్యాలు వ్రాసి, మోక్షలక్ష్మీకటాక్షానికి పాత్రులు అవుతారు. మరి ఆ విష్ణుమూర్తినే కని, పెంచి, పోషించే అదృష్టానికి నోచుకున్న తల్లిదండ్రులు ఏ లోకానికి చేరుతారో?"

10.1-352-వ.

అనిన విని రాజయోగికి శుకయోగి యిట్లనియె.

<u>టీక</u>:- అనినన్ = అనగా; విని=విని; రాజయోగి = పరీక్షిత్తున; కిన్=కు; శుక = శుకుడు అనెడి; యోగి = యోగులలో; ఇంద్రుండు = ఉత్తముడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

<u>భావము</u>:- అని రాజయోగి అయిన పరీక్షిన్మహారాజు అడుగగా, యోగిబ్రహ్మ శుకుడు ఇలా అన్నాడు.

10.1-353-సీ.

"అవనీశ! విను ద్రోణుఁ డనువాఁడు వసువుల-

యందు ముఖ్యుఁడు; ధర యతని భార్య;

వారి నిద్దఱ బ్రహ్మ వసుధపై జన్మించు-

డంచుఁ బంపిన వార లతనిఁ జూచి

"విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి-

మా కిచ్చితేనిని మహి జనింతు"

మనవుడు "నట్ల కా"కనియె వేల్పులపెద్ద-

యా ద్రోణుఁ డీ నందుఁడై జనించె

10.1-353.1-ఆ.

ధర యశోద యయ్యెఁ; దనుజేంద్రవైరియుఁ

గమలగర్భుమాట గారవించి

తల్లిదండ్రు లనుచుఁ దగ వారి మన్నించె;

నధిక భక్తితోడ నలరి రిట్లు.

టీక:- అవనీశ = రాజా {అవనీశుడు - అవని (భూమి)కి ప్రభువు, రాజు}; విను = వినుము; ద్రోణుడు = ద్రోణుడు; అనువాడు = అనెడివాడు; వసువుల = వసువులు; అందున్ = లో; ముఖ్యుడు = ముఖ్యమైనవాడు; ధర = ధర అనెడి యామె; అతని = అతని యొక్క; భార్య = భార్య; వారిన్ = వారిని; ఇద్దఱన్ = ఇద్దరిని; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; వసుధ = నేల; పైన్ = మీద; జన్మించుడు = పుట్టండి; అంచున్ = అనుచు; పంపినన్ = పంపించగా; వారలు = వారు; అతనిన్ = అతనిని; చూచి = ఉద్దేశించి; విశ్వేశ్వరుండు = లోకము లన్నిటికి ప్రభువు; ఐన = అయిన; విష్ణు = నారాయణుని; సేవా = కొలుచుట యందలి; రతిన్ = ఆసక్తి; మా = మా; కున్ = కు; ఇచ్చి = ప్రసాదించితివి; ఏనిని = ఐనచో; మహిన్ = భూలోకమున; జనింతుము = పుట్టెదము; అనవుడు = అనగా; అట్ల = అట్లనే; కాక = అగుగాక; అనియె = పలికెను; వేల్పులపెద్ద = బ్రహ్మదేవుడు {వేల్పులపెద్ద - దేవతలందరి లోను అధికుడు , బ్రహ్మ}; ఆ = ఆ ప్రసిద్ధుడైన; ద్రోణుడి = ద్రోణుడే; ఈ = ఈ; నందుడు = నందుడు; ఐ = అయ్యి; జనించెన్ = పుట్టెను. ధర = ధర; యశోద = యశోదగా; అయ్యెన్ = పుట్టెను; దనుజేంద్రవైరియున్ = శ్రీహరి {దనుజేంద్రవైరి- రాక్షసులకు శత్రువు, విష్ణువు}; కమలగర్భు = బ్రహ్మదేవుని; మాటన్ =

పలుకును; గారవించి = మన్నించి; తల్లిదండ్రులు = తల్లిదండ్రులు; అనుచున్ = అనుచు; తగన్ = చక్కగా; వారి = వారిని; మన్నించెన్ = గౌరవించెను; అధిక = గాఢమైన; భక్తి = భక్తి; తోడన్ = తోటి; అలరిరి = ఒప్పిరి; ఇట్లు = ఈ విధముగ.

<u>భావము</u>:- "ఓ పరీక్షిత్తు మహారాజా! చెప్తాను విను! వసువులు అనే దేవతలలో "ద్రోణుడు"అనేవాడు ముఖ్యుడు; అతని భార్య "ధర"; బ్రహ్మదేవుడు వారిద్దరినీ భూలోకంలో జన్మించమని ఆదేశించాడు; "విశ్వేశ్వరుడైన విష్ణుమూర్తిని సేవించే భాగ్యం ప్రసాదించినట్లు అయితే అలాగే భూమిపై జన్మిస్తాము"అన్నారు ఆ దంపతులు; బ్రహ్మదేవుడు "అలాగే"అని అనుగ్రహించాడు; ఆ ద్రోణుడు అనే వసువే ఈ నందుడుగా జన్మించాడు, ధరాదేవి అనే వసువే యశోద; శ్రీమన్నారాయణుడు కూడా బ్రహ్మదేవుని మాట మన్నించి ఆ దంపతులను తల్లిదండ్రులుగా అంగీకరించాడు; ఎంతో భక్తితో, సంతోషంతో గౌరవించాడు;

## చిలుకుతున్న కవ్వం పట్టుట

10.1-354-వ.

అంత నొక్కనాఁడు తన యింటికడ పాప లందఱు నయ్యె పనులందుఁ బంపుపడిపోయిన నందసుందరి సంరంభంబునం దరికంబంబు కడఁ గుదురున నొక్క దధికుంభంబు పెట్టి మిసిమిగల మీఁగడపెరుగు గూడంబోసి వీఁక నాఁక త్రాడు కవ్వంబున నలంవరించి.

<u>టీక</u>:- అంతన్ = అప్పుడు; ఒక్క = ఒకానొక; నాడున్ = రోజు; తన = తన యొక్క; ఇంటి = నివాసము; కడన్ = వద్ద; పాపలు = సేవకురాళ్ళు; అందఱున్ = అందరు; అయ్యె = వేరువేరు; పనులు = పనులు; అందున్ = లో; పడిపోయినన్ = మునిగిపోగా; నంద = నందుని యొక్క; సుందరి = భార్య; సంరంభంబునన్ = వేగిరపాటుతో; తరి = చిలుకుటకైన; కంబంబున్ = స్తంభము; కడన్ = వద్ద; కుదురున్ = కుండ పెట్టే కుదురు మీద {కుదురు - కుండ కదలకుండ కుండ క్రింద పెట్టెడి గుండ్రని చుట్ట}; ఒక్క = ఒకానొక; దధి = పెరుగు; కుంభంబు = కుండను; పెట్టి = ఉంచి; మిసిమి = వెన్న; కల = ఉన్నట్టి; మీగడ = తొరకకట్టిన; పెరుగున్ = పెరుగులను; కూడన్ = కలియ; పోసి = పోసి; వీకన్ = పూనికతో; నాకత్రాడు = కవ్వపుతాడు; కవ్వంబునన్ = కవ్వమునకు; అలంవరించి = చక్కగాచుట్టి.

<u>భావము</u>:- ఒక రోజు యశోదాదేవి ఇంటివద్ద ఉన్న యువతులు అందరూ వారి పనులమీద వెళ్ళిపోయారు. యశోదాదేవి పెరుగు చిలకడానికి చిలుకు స్తంభం వద్ద కుదురు పెట్టి, దానిమీద పెరుగు కుండను పెట్టింది. తరిత్రాటిని కవ్వానికి తగిలించి పెరుగు చిలకడం మొదలు పెట్టింది.

10.1-355-సీ.

కరకమలారుణ కాంతిఁ గవ్వపు ద్రాడు-
పవడంపు నునుఁదీఁవ పగిది మెఱయఁ;
గ్రమముతో రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు-
వీడ్వడి యొండొంటి వీఁక నొత్తఁ;
గుచకుంభములమీఁది కొంగు జాఱఁగ జిక్క-
పడుచు హారావళుల్ బయలుపడగఁ;
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మొము-
మంచు పైఁబడిన పద్మంబుఁ దెగడఁ;

10.1-355.1-తే.

గౌను నులియంగఁ; గంకణక్వణన మెసఁగఁ;
దుఱుము బిగివీడఁ; గర్ణికాద్యుతులు మెఱయ;
బాలు నంకించి పాడెడి పాట వలనఁ
దరువు లిగురొత్త బెరు గింతి దరువఁ జొచ్చె.

<u>టీక</u>:- కర = చేతులు అనెడి; కమల = పద్మముల; అరుణ = ఎఱ్ఱని; కాంతిన్ = మెరుపువలన; కవ్వపుత్రాడు = నాకతాడు, తరితాడు; పవడంపు = పగడాల; నును = నున్నటి; తీవ = తీగలాగ; పగిదిన్ = వలె; మెఱయన్ = ప్రకాశించుచుండగా; క్రమము = ఒకపద్ధతి; తోన్ = ప్రకారము; రజ్జువున్ = తాడును; ఆకర్షింపన్ = పట్టుకొని లాగుతుండగా; పాలిండ్లు = స్తనములు; వీడ్వడి = విడివిడిగానై; ఒండొంటిన్ = ఒకదానినొకటి; వీకన్ = గట్టిగా; ఒత్తన్ = ఒరసికొనగా; కుచ = స్తనములు అనెడి; కుంభముల = కుండల; మీది = మీద ఉన్న; కొంగు = చీరకొంగు; జాఱగన్ = జారుచుండగా; చిక్కుపడుచున్ = మెలికలుపడుతు; హార = మెడలోనిదండల; ఆవళుల్ = వరుసలు; బయలుపడగన్ = బయటికిరాగా; పొడమిన = పుట్టిన; చెమట = చెమటబిందువుల;

తోన్ = తోటి; పొల్పారు = అందంగా కనబడుతుండగా; నెఱ = నిండైన; మోము = ముఖము; మంచు = మంచు బిందువులు; పైన్ = మీద; పడిన = పడినట్టి; పద్మంబున్ = పద్మములను; తెగడన్ = పరిహసించగా; కౌను = నడుము.

నులియంగన్ = ఊగిసలాడగా; కంకణ = చేతికంకణముల, గాజుల; క్వణన = శబ్దము; ఎసగన్ = అతిశయించగా; తుఱుము = జుట్టుముడి; బిగి = బిగింపు; వీడన్ = వదులుకాగా; కర్ణికా = చెవి ఆభరణముల; ద్యుతులు = కాంతులు; మెఱయన్ = మెరుస్తుండగా; బాలున్ = బాలకృష్ణుని; అంకించి = ఉద్దేశించి; పాడెడి = పాడుతున్న; పాట = పాట; వలన = వలన; తరువులు = చెట్లు; ఇగురొత్తన్ = చిగురించునట్లుగా; పెరుగున్ = పెరుగును; ఇంతి = యశోద; తరువజొచ్చె = చిలకసాగెను.

<u>భావము</u>:- అలా యశోదాదేవి పెరుగు చిలుకుతుండగా, ఆమె చేతుల అరుణకాంతులు కవ్వం తాటిపై పడి అది పగడపుతీగలాగ మెరుస్తోంది. తాడును క్రమపద్ధతిలో ఒకదాని తరువాత ఒకటి లాగుతుంటే, ఆమె పాలిండ్లు ఒకదానితో ఒకటి ఒరుసుకుంటున్నాయి. వక్షోజాలపై ఉన్న కొంగు జారుతోంది. మెడలోని హారాలు చిక్కు పడుతూ కనబడుతూ ఉన్నాయి. పట్టిన చెమట బిందువులతో అందంగా ఉన్న ముఖం మంచుబిందువులు చెందిన తామరపూవు కన్నా మనోహరంగా ఉంది. సన్నని నడుము జవజవలాడుతూ ఉంది. చేతుల గాజులు గలగలలాడుతూ ఉన్నాయి. కొప్పుముడి బిగింపు సడలుతూ ఉంది. చెవుల కమ్మల కాంతులు తళుక్కుమంటూ ఉన్నాయి. ముద్దు కృష్ణుని ఉద్దేశించి ఆమె పాడేపాటకు చెట్లు చిగురుస్తూ ఉన్నాయి. ఇలా యశోదాదేవి పెరుగు చిలుకుతూ ఉంది.

### 10.1-356-వ.

ఆ సమయంబున.

<u>టీక</u>:- ఆ = ఆ; సమయంబునన్ = సమయమునందు.

<u>భావము</u>:- యశోద పెరుగు చిలుకుతూ ఉండగా.

10.1-357-క.

సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు

సుడి గొట్టుచు "నమ్మ! రమ్ము; చన్ని"మ్మనుచున్

వెడవెడ గంతులు వైచుచుఁ

గడవఁ గదిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్.

టీక:- సుడియుచున్ = గుండ్రంగా తిరుగుతూ; వ్రాలుచున్ = వాలిపోతూ; కిదుకుచున్ = గారాలుపోతూ; చడిగొట్టుచున్ = గోలచేస్తు, చప్పుళ్ళు చేస్తూ; అమ్మ = తల్లి; రమ్ము = రా; చన్ను = చనుబాలు; ఇమ్ము = ఇయ్యి; అనుచున్ = అంటూ; వెడవెడ = పిల్లిగంతులు; వైచుచున్ = వేస్తూ; కడవన్ = పెరుగుకుండను; కదిసి = చేరి; బాలకుండు = పిల్లవాడు; కవ్వమున్ = కవ్వమును; పట్టెన్ = పట్టుకొన్నాడు.

భావము:- కృష్ణబాలకుడు ఆమె చుట్టూ తిరుగుతూ, మీద పడుతూ, పైటలాగతూ అల్లరి చేయసాగాడు. “అమ్మా! రావే! నాకు పాలియ్యవే!” అంటూ గంతులు వేస్తూ దగ్గరకొచ్చి, చిన్నారి కన్నయ్య కవ్వాన్ని కదలకుండా పట్టుకున్నాడు.

10.1-358-క.

కవ్వముఁ బట్టిన ప్రియసుతు

న వ్వనరుహనేత్ర దిగిచి యంకతలమునన్

నవ్వుచు నిడుకొని కూఁకటి

దువ్వుచుఁ జన్నిచ్చె; నతఁడు దూఁటుచుఁ గుడిచెన్.

టీక:- కవ్వమున్ = కవ్వమును; పట్టిన = పట్టుకొనిన; ప్రియ = ముద్దుల; సుతున్ = పుత్రుని; ఆ = ఆ; వనరుహనేత్ర = సుందరి {వనరుహనేత్ర - వనరుహ (పద్మములవంటి) నేత్రములు కలామె, స్త్రీ}; తిగిచి = తీసుకొని; అంకతలమునన్ = ఒడిలో; నవ్వుతున్ = నవ్వుతూ; ఇడుకొని = ఉంచుకొని; కూకటిన్ = జుట్టుపిలక; దువ్వుచున్ = దువ్వుతూ; చన్ను = చనుబాలు; ఇచ్చెన్ = ఇచ్చెను; అతడున్ = అతను; దూటుచున్ = పీల్చుచు; కుడిచెన్ = తాగెను.

భావము:- యశోదాదేవి కవ్వం పట్టుకున్న తన కొడుకు కృష్ణుడిని నవ్వుతూ దగ్గరకు తీసుకుంది. ఒళ్లో కూర్చుండ బెట్టుకుంది. ప్రేమగా జుట్టు దువ్వుతూ అతనికి పాలు ఇవ్వసాగింది. నల్లనయ్య చక్కగా తల్లిరొమ్ములో తలదూర్చి తాగుతున్నాడు.

10.1-359-మ.

కడుపారం జనుబాలు ద్రావని సుతుం గంజాక్షి పీఠంబుపై

నిడి పొంగారెడు పాలు డించుటకునై యేగంగఁ దద్బాలుఁ డె

క్కుడు కోపంబున వాఁడిఱాత దధిమత్కుంభంబుఁ బోఁగొట్టి తెం

పడరం గుంభములోని వెన్నఁ దినె మిథ్యా సంకులద్బాష్పుఁడై.

టీక:- కడుపారన్ = కడుపునిండుగా; చనుబాలు = చనుబాలు; త్రావని = తాగుటపూర్తిచేయని; సుతున్ = పుత్రుని; కంజాక్షి = పద్మాక్షి; పీఠంబు = పీట; పైన్ = మీద; ఇడి = పెట్టి; పొంగారెడు = పొంగిపోవుచున్న; పాలున్ = పాలను; డించుట = పొయ్యి మీంచి దింపుట; కున్ = కోసము; ఐ = అయ్యి; ఏగంగన్ = వెళ్ళగా; తత్ = ఆ; బాలుడు = పిల్లవాడు; ఎక్కుడు = అధికమైన; కోపంబునన్ = కోపముతో; వాడి = సూదియైన; ఱాతన్ = రాయితో; దధిమత్కుంభంబున్ = పెరుగుతో నిండుగానున్న కుండను; పోగొట్టి = పగులగొట్టి; తెంపు = పెంకితనము; అడరన్ = పెరిగిపోగా; కుంభము = కుండ; లోని = అందలి; వెన్నన్ = వెన్నను; తినెన్ = తినెను; మిథ్యా = దొంగ; సంకులత్ = కారుతున్న; బాష్పుడు = కన్నీరు కలవాడు; ఐ = అయ్యి.

భావము:- కవ్వం పట్టుకున్న చిన్నారి కృష్ణునికి యశోదాదేవి పాలు ఇస్తూ, పొయ్యిమీది పాలు పొంగిపోతున్నాయి అని చూసింది. అతను పాలు తాగటం పూర్తికాకుండానే పీటమీదకి దింపేసింది. పాలకుండ దింపడానికి గబగబా లోపలికి వెళ్ళింది. తన కడుపు నిండకుండా మధ్యలో వెళ్ళిందని కోపంతో వాడిరాతితో నిండుగా ఉన్న పెరుగుకుండను పగులగొట్టాడు. పగిలిన కుండలోని వెన్నను తినసాగాడు. పైపెచ్చు దొంగకన్నీళ్లు కారుస్తూ ఏడవటం మొదలెట్టాడు.

10.1-360-వ.

అంత నా లోలలోచన పాలు డించి వచ్చి వికలంబు లయిన దధికుంభ శకలంబులఁ బొడఁగని తుంటకొడుకు వెన్న దింట యెఱింగి నగుచు నా కలభగామిని యతనిం గానక చని చని.

టీక:- అంతన్ = అప్పుడు; ఆ = ఆ; లోలలోచన = సుందరి {లోల లోచన - చలించెడి కన్నులు కలామె, స్త్రీ}; పాలున్ = పాలను; డించి = పొయ్యిమీదనుంచి దించి; వచ్చి = వెనుకకు వచ్చి; వికలంబులు = పగిలిపోయిన; దధికుంభ = పెరుగుకుండ; శకలంబులన్ = పెంకులను; పొడగని = చూసి; తుంట = తుంటరి; కొడుకు = కుమారుడు; వెన్నన్ = వెన్నని; తింటన్ = తినుట; ఎఱింగి = తెలిసికొని; నగుచున్ = నవ్వుతూ; ఆ = ఆ; కలభగామిని = సుందరి {కలభగామిని - కలభ (ఏనుగుగున్న వంటి) నడక కలామె, స్త్రీ}; అతనిన్ = అతనిని; కానకన్ = కనుగొనలేక; చనిచని = బాగా తిరిగి.

భావము:- యశోదాదేవి పొయ్యిమీది పాలు దించి వచ్చింది. పగిలిపోయిన పెరుగుకుండ ముక్కలను చూసింది. తుంటరి కొడుకు వెన్న మీగడలు తిన్నాడని గ్రహించి నవ్వుకుంటూ చూస్తే, కొంటె కృష్ణుడు కనిపించలేదు. అతణ్ణి వెతుక్కుంటూ బయలుదేరింది యశోద.

10.1-361-ఆ.

వికచకమలనయన వే ఱొక యింటిలో
వెలయ ఱోలు దిరుగవేసి యెక్కి
యుట్టిమీఁది వెన్న నులుకుచు నొక కోఁతి
పాలు జేయుచున్న బాలుఁ గనియె.

టీక:- వికచకమలనయన = పడతి {వికచ కమల నయన - విరిసిన పద్మముల వంటి కన్నులు కలామె, స్త్రీ}; వేఱొక = మరొకరి; ఇంటి = నివాసము; లోన్ = అందు; వెలయన్ = చక్కగా; ఱోలున్ = రోటిని; తిరుగవేసి = తిరగేసి; ఎక్కి = పైకెక్కి; ఉట్టి = ఉట్టి {ఉట్టి - పాలు పెరుగాదులు దాచుట కోసం వేళ్ళాడలా కట్టబడెడి చిక్కము}; మీది = పైనున్న; వెన్నన్ = వెన్నను; ఉలుకుచున్ = బెదురుతూ; ఒక = ఒకానొక; కోతి = కోతి; పాలున్ = కిపెట్టుట; చేయుచున్న = చేస్తున్న; బాలునిన్ = పిల్లవానిని; కనియెన్ = చూసెను.

భావము:- ఇంట్లో పెరుగుకుండ పగలగొట్టిన కృష్ణుడు, అక్కడ మరొక ఇంటిలో ఒక రోలుని తిరగేసి, చక్కగా దానిమీద ఎక్కాడు. ఉట్టిమీద ఉన్న వెన్నతీసి బెదురుతూనే ఒక కోతికి పెడుతున్నాడు. యశోదమ్మ వచ్చి అతడు చేస్తున్న ఆ అల్లరి పని చూసింది.

## యశోద కృష్ణుని అదిలించుట

10.1-362-మ.

కని చేతన్ సెలగోలఁ బట్టికొనుచుం "గానిమ్ము గానిమ్ము రా

తనయా! యెవ్వరి యందుఁ జిక్కుపడ నేదండంబునుం గాన నే

వినివారంబును బొంద నే వెఱపు నే విభ్రాంతియుం జెంద ము

న్ననియో నీవిటు నన్నుఁ గైకొనమి నేఁడారీతి సిద్ధించునే."

టీక:- కని = చూసి; చేతన్ = చేతితో; సెలగోల = చెర్నాకోల, కొరడాకఱ్ఱ {సెలగోల - కఱ్ఱచివర తాడువంటిది ఉండి గుఱ్ఱబ్బండి ఆదుల తోలు కొరడాకఱ్ఱ, చెర్నాకోల}; పట్టికొనుచున్ = పట్టుకొంటు; కానిమ్ము = చెయ్యి; కానిమ్మురా = అలానే చెయ్యి; తనయా = కొడుకా; ఎవ్వరి = ఎవరి; అందున్ = కును; చిక్కుపడన్ = దొరకినవాడను కాను; ఏ = ఎట్టి; దండంబునున్ = శిక్షించుటను; కానన్ = చూసినవాడను కాను; ఏ = ఎట్టి; వినివారంబునున్ = నిర్బంధమును; పొందన్ = పొందినవాడను కాను; ఏ = ఎట్టి; వెఱపున్ = బెదిరించుటను; ఏ = ఏట్టి; విభ్రాంతియున్ = తొందరపాటులు; చెందన్ = చెందినవాడను కాను; మున్ను = ఇప్పటివరకు; అనియో = అనగా ఏమి; నీవు = నువ్వు; ఇటున్ = ఇలా; నన్నున్ = నన్ను; కైకొనమి = లక్ష్యపెట్టకపోవుట; నేడు = ఇవాళ; ఆరీతిన్ = ఆవిధముగ; సిద్ధించునే = జరుగునా, జరుగదు.

భావము:- కృష్ణుడు కోతికి వెన్న పెడుతూ అల్లరిచేస్తుండటం చూసిన యశోద బెత్తం చేతిలో పట్టుకొని "కన్నయ్యా! నువ్వు ఇప్పటివరకూ ఎవరి చేతికీ చిక్కలేదనీ, నిన్ను ఎవరూ శిక్షించలేరని, ఎవరూ అడ్డుకోలేరని, నిన్ను భయపెట్టరనీ, నీకు అదురూ బెదురూ లేకుండా పోయింది. అందుకే గదా నా మాట బొత్తిగా వినటంలేదు! సరే కానియ్యి! ఇవాళ ఎలా తప్పించుకుంటావో చూస్తాను"

10.1-363-వ.

అని యదలించుచు కొడుకు నడవడిం దలంచి తనుమధ్య దన మనంబున.

టీక:- అని = అని; అదిలించుచున్ = బెదిరించుచు; కొడుకున్ = పుత్రుని; నడవడిన్ = ప్రవర్తనను; తలంచి = తలచికొని; తనుమధ్య = ఇంతి {తను మధ్య - సన్నని నడుము కలామె, స్త్రీ}; తన = ఆమె యొక్క; మనంబునన్ = మనసునందు.

భావము:- అంటూ యశోద కృష్ణున్ని అదలిస్తూ, తన కొడుకు దుడుకుతనం తలచుకుంటూ ఇలా అనుకుంటోంది..

10.1-364-సీ.

"బాలుఁ డీతండని భావింతు నందునా-
    యే పెద్దలును నేర రీక్రమంబు
వెఱ పెఱుంగుటకు నై వెఱపింతు నందునా-
    కలిగి లే దొక్కఁడు గాని లేఁడు
వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా-
    తనుఁ దాన యై బుద్ధిఁ దప్పకుండు
నొం డెఱుంగక యింట నుండెడి నందునా-
    చొచ్చి చూడని దొకచోటు లేదు

10.1-364.1-ఆ.

తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాఱెడి
యోజ లేదు భీతి యొక టెఱుంగఁ
డెలమి నూరకుండఁ డెక్కసక్కెము లాడుఁ
బట్టి శాస్తిజేయు భంగి యెట్లు?"

టీక:- బాలుడు = పిల్లవాడు; ఈతండు = ఇతను; అని = అని; భావింతునందునా = అనుకొందామంటే; ఏ = ఎలాంటి; పెద్దలును = పెద్దవారుకూడ; నేరరు = చేయలేరు; ఈక్రమంబున్ = ఈవిధముగా; వెఱపున్ = భయము; ఎఱుంగుటకు = చెప్పుటకు; ఐ = కోసము; వెఱపింతును = భయపెట్టెదను; అందునా = అనుకొందామంటే; కలిగిలేక = లేకలేక; ఒక్కడు = ఇతడొక్కడే; కాని = తప్పించి; లేడు = మరొకడులేడు; వెఱపు = భయపెట్టుట; తోన్ = తోటి; నా = నా యొక్క; బుద్ధిన్ = మంచిబుద్ధిని; వినిపింతున్ = చెప్పెదను; అందునా = అనుకొందామంటే; తనున్ = తనంతట; తాన = తానే; ఐ = ఉండి; బుద్ధిన్ = మంచిబుద్ధిని; తప్పకుండున్ = క్రమముగానుండును; ఒండున్ = ఇతర విషయములేవీ; ఎఱుంగక = తెలిసికొనకుండ; ఇంటన్ = ఇంట్లోనే; ఉండెడిన్ = ఉండుము; అందునా = అనుకొందామంటే; చొచ్చి = దూరి; చూడనిది = చూడనట్టిది; ఒక = ఒక్కటైనా; చోటు = స్థలము; లేదు = లేదు.

తన్నున్ = అతనిని; ఎవ్వరైనన్ = ఎవరైనాసరే; తలపోయెన్ = తలచుకొనినచో; పాఱెడి = పరిగెట్టిపోయెడి; ఓజ = విధము; లేదు = లేదు; భీతి = భయము; ఒకటెఱుంగడు = అసలులేదు; ఎలమిన్ = చక్కగా; ఊరకుండడు = ఊరుకోడు; ఎకసక్కెములు = వంకరమాటలు; ఆడున్ = పలుకును; పట్టి = పట్టుకొని; శాస్తి = తగినశిక్ష; చేయన్ = చేయవలసిన; భంగి = విధము; ఎట్లు = ఏమిటి.

భావము:- కన్నయ్యని పోనీ పసిపిల్లాడులే అనుకుందామంటే, ఇలాంటి నడవడి పెద్దలకు ఎవరికి తెలియదు; పోనీ ఇతడికి కొద్దిగా భయం చెబ్దాం అనుకుందామంటే, లేకలేక పుట్టినవాడు వీడొక్కడే మరోడు లేడాయె; బెదిరించి బుద్ధులు నేర్పుదాం అంటే, తనంతట తనే బుద్ధిగా ఉంటున్నాడాయె; అలాగనీ ఏమి తెలియకుండా ఇంట్లో కూర్చుంటాడులే అనుకుంటే, వీడు వెళ్ళని చోటు, చూడని చోటు ఏదీ లేనే లేదాయె; తనని ఎవరైనా చూస్తే పారిపోదామనే ఆలోచనే కూడా వీడికి రాదు; అసలు భయం అన్నదే తెలియదు; మళ్ళీ ఊరికే ఉండడు, ఎకసెక్కాలాడుతూనే ఉంటాడు; వీణ్ణి పట్టుకొని తగిన శాస్తి చేయటం ఎలా?

10.1-365-వ.

అని వితర్కించి.

టీక:- అని = అని; వితర్కించి = బాగుగ తర్కించుకొని.

భావము:- కన్నయ్యకు బుద్ధి చెప్పటం ఎలా అని ఆలోచించుకుంటోంది

*10.1-366-క.

లా**ల**నమున బహుదోషము

లో**లిం** బ్రాపించుఁ దాడనోపాయములన్

జా**ల** గుణంబులు గలుగును

బా**లు**రకును దాడనంబ పథ్యం బరయన్.

టీక:- లాలనముననన్ = గారాబముచేత; బహు = అనేకమైన; దోషములు = లోపములు; ఓలిన్ = క్రమముగా; ప్రాపించున్ = కలుగును; తాడనోపాయములన్ = దండోపాయములచేత; చాలన్ = మిక్కిలిగ, చాలా; గుణంబులున్ = సుగుణములు; కలుగును = లభించును; బాలురు = మగపిల్లల; కును = కు; తాడనంబ = కొట్టి దండించుటయే; పథ్యంబు = తగినపని, మందు;

అరయన్ = తరచిచూసినచో.

<u>భావము</u>:- గారాబం మరీ ఎక్కువ చేస్తే పిల్లలు చివరికి చెడిపోతారు. అప్పుడప్పుడు తగలనిస్తుంటే మంచి గుణాలు అలవడతాయి. పిల్లల మితిమీరే అల్లరికి చక్కటి ఔషధం దండోపాయం.

"దండం దశగుణ భవేత్" అంటారు కదా.

"శ్లో. లాలనాద్బహవో దోషాస్తాడనాద్బహవో గుణాః|
తస్మాత్పుత్రం చ శిష్యం చ తాడయేన్నతులాలయేత్ప||"

అని ఒక నీతిశాస్త్ర బోధ.

10.1-367-వ.

అని నిశ్చయించి కేలనున్న కోల జళిపించి "బాలా! నిలునిలు" మని బగ్గుబగ్గున నదల్చుచు దల్లి డగ్గఱిన బెగ్గడిలిన చందంబున నగ్గలికచెడి ఱోలు డిగ్గ నుఱికి.

<u>టీక</u>:- అని = అని; నిశ్చయించి = నిర్ణయించుకొని; కేలన్ = చేత; ఉన్న = ఉన్నట్టి; కోలన్ = కొరడాకఱ్ఱను; జళిపించి = వేగముగా ఊపి; బాలా = పిల్లవాడా; నిలునిలుము = ఆగిపొమ్ము; అని = అని; బగ్గుబగ్గున = కోపముతో మండిపోతూ; అదల్చుచు = బెదిరించుచు; తల్లి = అమ్మ; డగ్గఱినన్ = దగ్గరకు రాగా; బెగ్గడిలిన = భయపడిపోయిన; చందంబునన్ = విధముగ; అగ్గలిక = ఉత్సాహము; చెడి = పోయి; ఱోలున్ = రోటిని; డిగ్గన = దుమికి; ఉఱికి = పరుగెట్టి.

<u>భావము</u>:- అల్లరి కృష్ణుని ఆగడాలు ప్రత్యక్షంగా చూసిన తల్లి యశోద. . దండించాలి అని నిర్ణయించుకొంది. చేతిలో బెత్తం పట్టుకొని కోపంతో ఝుళిపిస్తూ "ఒరేయ్ పిల్లాడా! ఆగక్కడ" అని అరుస్తూ యశోద దగ్గరకు వచ్చింది . కృష్ణ బాలుడు భయపడినట్లు ముఖం పెట్టి, అల్లరి ఆపేసాడు. గభాలున రోలుమీంచి కిందకి దూకాడు

*10.1-368-క.

గజ్జలు గల్లని మ్రోయఁగ

అజ్జలు ద్రొక్కుటలు మాని యతిజవమున యో

షిజ్జనములు నగఁ దల్లియుఁ

బజ్జం జనుదేర నతఁడు పరువిడె నధిపా!

టీక:- గజ్జలు = కాలిగజ్జలు; గల్లు = గల్లుగల్లు; అని = అని; మ్రోయగన్ = మోగుతుండగా; అజ్జలు = చిందులు; త్రొక్కుటలు = వేయుట; మాని = వదిలేసి; అతి = మిక్కిలి; జవమునన్ = వేగముగా; యోషిజ్జనములు = ఆడవాళ్ళు; నగన్ = నవ్వుతుండగ; తల్లియున్ = తల్లి; పజ్జన్ = కూడా; చనుదేరన్ = వస్తుండగా; అతడు = అతను; పరువిడెన్ = పరుగెట్టెను; అధిపా = రాజా.

భావము:- చిలిపి కృష్ణుడు చిందులు తొక్కటాలు మానేసి, చాలా వేగంగా పరుగు లంకించుకున్నాడు. కాలి గజ్జలు గల్లు గల్లు మని మ్రోగుతున్నాయి. తల్లి యశోదాదేవి వెంట పరుగెట్టుకుంటూ వస్తోంది. గోపికా స్త్రీలు నవ్వుతూ చూస్తున్నారు.

10.1-369-వ.

అప్పుడు.

టీక:- అప్పుడు = ఆ సమయము నందు.

భావము:- అప్పుడు.

10.1-370-మ.

స్తనభారంబున డస్సి క్రుస్సి యసదై జవ్వాడు మధ్యంబుతో

జనిత స్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో

వనజాతేక్షణ గూడ బాఱి తిరిగెన్ వారించుచున్ వాకిటన్

ఘనయోగీంద్ర మనంబులున్ వెనుకొనంగా లేని లీలారతున్.

టీక:- స్తన = స్తనముల; భారమునన్ = బరువు వలన; డస్సి = అలసిపోయి; క్రుస్సి = చిక్కిపోయి; అసదు = సన్ననిది; ఐ = అయ్యి; జవ్వాడు = ఊగిపోయెడి; మధ్యంబు = నడుము; తోన్ = తోటి; జనిత = పట్టిన; స్వేదము = చెమట; తోన్ = తోటి; చలత్ = కదిలిపోతున్న; కబరి = జుట్టుముడి; తోన్ = తోటి; స్రస్త = జారిపోయిన; ఉత్తరీయంబు = పైట; తోన్ = తోటి; వనజాతేక్షణ = పద్మాక్షి; కూడ = వెంhట; పాఱి = పరుగెట్టి; తిరిగెన్ = వెళ్ళెను; వారించుచున్ = ఆగుమనుచు; వాకిటన్ = ఇంటి ముందటి వాకిట్లో; ఘన = గొప్ప; యోగి = యోగులలో; ఇంద్ర =

శ్రేష్ఠుల; మనంబులున్ = మనసులం దైనను; వెనుకొనంగాలేని = వెంబడింప జాలని; లీలారతున్ = విహారములు కలవానిని.

భావము:- యశోదామాత "ఆగు, ఆగు" అంటూ ఇంటి ముంగిలిలో పరుగెడుతున్న బాలకృష్ణుడి వెంట పరుగెడుతున్నది. పెద్ద వక్షోజాల బరువుతో అలసిపోతూ, వంగిపోతూ ఉంది. సన్నని నడుము జవజవలాడుతూ ఉంది. పరుగెట్టే వేగానికి కొప్పు కదిలి జారిపోతూ ఉంది. చమటలు కారిపోతూ ఉన్నాయి. పైట జారిపోతూ ఉంది. మహామహా యోగీంద్రుల మనస్సులు కూడా పట్టుకోలేని ఆ లీలాగోపాల బాలుణ్ణి పట్టాలనే పట్టుదలతో వెంటపడి తరుముతూ ఉన్నది.

ఎంత అదృష్టం యశోదాదేవిది.

## కృష్ణుని ఱోలుకి కట్టుట

10.1-371-వ.

ఇట్లు గూడం జని.

టీక:- ఇట్లు = ఈ విధముగ; కూడంజని = వెంటబడి.

భావము:- యశోద ఇలా శ్రీకృష్ణబాలుడి వెంటపడి,

10.1-372-సీ.

స్తంభాదికంబులు దనకు నడ్డం బైన-
నిట్టట్టు చని పట్టనీనివాని
నీ తప్పు సైరింపు మింక దొంగిలఁ బోవ-
నే నని మునుముట్ట నేడ్చువాని
గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు-
వెడలు కన్నీటితో వెగచువాని
నే దెస వచ్చునో యిది యని పలుమాఱు-
సురుగుచుఁ గ్రేగంటఁ జూచువానిఁ

10.1-372.1-ఆ.

గూడఁ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ
జిన్న వెన్నదొంగ చిక్కె ననుచు
నలిగి కొట్టఁ జేతు లాడక పూఁబోఁడి
కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి.

<u>టీక</u>:- స్తంభ = స్తంభము; ఆదికంబులు = మున్నగునవి; తన = అతని; కిన్ = కి; అడ్డంబు = అడ్డము; ఐనన్ = వచ్చినచో; ఇట్టట్టు = ఇటునటు; చని = వెళ్లి; పట్టనీని = పట్టుకోనీయని; వానిన్ = వాడిని; ఈ = ఈ ఒక్క; తప్పు = తప్పును; సైరింపుము = ఓర్చుకొనుము; ఇంకన్ = ఇక; దొంగిల = దొంగతనమునకు; పోవన్ = వెళ్ళను; నేను = నేను; అని = అని; మునుముట్టన్ = ముందుగానే; ఏడ్చు = ఏడ్చేసే; వానిన్ = వాడిని; కాటుక = కాటుక; నెఱయంగన్ = పాకిపోయెలాగ; కన్నులున్ = కళ్ళను; నులుముచున్ = నులుముకొనుచు; వెడలు = కారుతున్న; కన్నీరు = కన్నీరు; తోన్ = తోటి; వెగచు = వెక్కివెక్కి ఏడ్చెడి; వానిన్ = వాడిని; ఏ = ఏ; దెసన్ = వైపునుండి; వచ్చునో = వచ్చెస్తుందో; ఇది = ఈమె; అని = అని; పలు = అనేక; మాఱు = సార్లు; సురుగుచున్ = స్రుక్కుచు; క్రేగంటన్ = ఓరకంటితో; చూచు = చూచెడి; వానిన్ = వాడిని; కూడబాఱి = వెంటబడి.
పట్టుకొని = పట్టుకొని; వెఱపించుచున్ = బెదిరించుచు; చిన్న = చిన్నవాడైన; వెన్నదొంగ = వెన్నను దొంగిలించువాడు; చిక్కెను = దొరికెను; అనుచున్ = అంటు; అలిగి = కోపగించి; కొట్టన్ = కొట్టుటకు; చేతులు = చేతులు; ఆడక = రాక; పూబోడి = సుందరి {పూబోడి - పువ్వువలె సున్నితమైనామె, స్త్రీ}; కరుణ = దయ; తోడన్ = తోటి; బాలున్ = పిల్లవానిని; కట్టన్ = కట్టివేద్దామని; తలచి = భావించి.

<u>భావము</u>:- కృష్ణబాలుడు వాకిట్లో స్తంభాలు అడ్డంగా ఉంటే వాటి చాటున ఇటు అటు దొరక్కుండా పరిగెడుతున్నాడు; "ఈ ఒక్కసారికీ క్షమించవే! ఇంకెప్పుడూ దొంగతనం చేయనే!" అంటూ మునుముందే ఏడుస్తున్నాడు; కాటుక చెదిరేలా కళ్ళు నులుము కుంటున్నాడు; కన్నీరు కారుతుండగా వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు; తన తల్లి ఎటువైపు నుంచి వస్తుందో అని బెదురుతూ మాటి మాటికీ క్రీగంట చూస్తున్నాడు, పక్కలకు తప్పుకుంటున్నాడు; చివరికి ఎలాగైతేనేం వెంటబడి తరుముతున్న యశోద "అమ్మయ్య! ఈ చిన్ని వెన్నదొంగచిక్కాడు." అంటూ భుజం పట్టుకుంది; కానీ ఆమెకు కొట్టటానికి చేతులు రాలేదు, యశోద శరీరము, స్వభావము కూడా పువ్వువలె సుతిమెత్తనైన పూబోడి కదా; కొడుకు మీద జాలిపడి కొట్టకుండా పోనీలే కట్టివేద్దా మనుకుంది;

10.1-373-వ.

ఇ ట్లనియె.

<u>టీక</u>:- ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

<u>భావము</u>:-యశోదాదేవి కృష్ణునితో ఇలా అంది.



*10.1-374-క.
"వీ**రె**వ్వరు? శ్రీకృష్ణులు
<u>గా</u>**రా?** యెన్నడును వెన్న( <u>గా</u>నర(ట కదా!
చో**ర**త్వం బించుకయును
<u>నే</u>**ర** ర(ట! ధరిత్రి నిట్టి <u>ని</u>యతులు గలరే?

<u>టీక</u>:- వీరు = ఈ పెద్దమనిషి; ఎవ్వరు = ఎవరు; శ్రీకృష్ణులు = కృష్ణుడుగారు; కారా = కాదా; ఎన్నడును = ఎప్పుడు; వెన్నన్ = వెన్నను; కానరు = చూడనే చూడ లేదు; అట = అట; కదా = కాదా; చోరత్వంబున్ = దొంగతనము; ఇంచుకయును = కొంచెము కూడ; నేరరు = చేతకాదు, తెలియదు; అట = అట; ధరిత్రిన్ = భూమిపైన; ఇట్టి = ఇలాంటి; నియతులు = పద్ధతి ప్రకారము ఉండువారు; కలరే = ఉన్నారా.

<u>భావము</u>:- ఓహో ఎవరండీ వీరు? శ్రీకృష్ణులవారేనా? అసలు వెన్నంటే ఎప్పుడూ చూడనే చూడలేదట కదా! దొంగతనమంటే ఏమిటో పాపం తెలియదట కదా! ఈ లోకంలో ఇంతటి బుద్ధిమంతులు లేనేలేరట!

పట్టుబడ్డ వెన్న దొంగను కొట్టటానికి చేతులురాని తల్లి యశోదాదేవి కొడుకును ఇలా దెప్పుతోంది.

10.1-375-క.
ప**ట్టి**న( బట్టుపడని నిను(
<u>బ</u>**ట్టె**ద నని చలము(గొనిన( <u>బ</u>ట్టుట బెట్టే?
ప**ట్టు**వడ వండ్రు పట్టీ
<u>ప</u>**ట్టు**కొనన్ నా(కు(గాక <u>ప</u>రులకు వశమే?

<u>టీక</u>:- పట్టినన్ = పట్టుకొన్నను; పట్టుబడని = చిక్కని; నినున్ = నిన్ను; పట్టెదన్ = పట్టుకుంటాను; అని = అని; చలము = పట్టుదల; కొనిన = పట్టినచో; పట్టుట = పట్టుకొనుట; బెట్టే = ఏమైనా ఘనకార్యమా; పట్టువడవు = చిక్కవు; అండ్రున్ = అనెదరు; పట్టీ = కొడుకా; పట్టుకొనన్ = పట్టుకొనుటకు; నా = నా; కున్ = కు; కాక = తప్పించి; పరులు = ఇతరుల; కున్ = కు; వశమే = శక్యమే.

<u>భావము</u>:- పట్టుకుందామంటే ఎవరికీ చిక్కనని అనుకుంటున్నావా. పట్టుకోవాలని నేను పట్టుబడితే నువ్వు దొరకటం పెద్ద కష్టం అనుకుంటున్నావా. నువ్వు చిక్కవు అని అందరూ అంటారు. నిన్ను పట్టుకోడం నాకు తప్ప ఇంకెవరికి సాధ్యం కాదురా."

అసలు తత్వం కూడా ఆ మహాతల్లి యశోదమ్మ నోట అంతరార్థంగా ఇలా బయటబడుతోంది.

10.1-376-క.
**ఎక్క**డనైనను దిరిగెద;
<u>వొ</u>**క్క** యెడన్ గుణము గలిగి <u>యుం</u>డవు; నియమం
బె**క్క**డిది నీకు? మఱచినఁ
<u>జ</u>**క్క**గఁ బోయెదవు పెక్కు <u>జా</u>డలఁ బుత్రా!

<u>టీక</u>:- ఎక్కడన్ = ఎక్కడను; ఐనన్ = అయినను; తిరిగెదవు = సంచరించెదవు; ఒక్క = ఏదో ఒక; యెడన్ = చోట; గుణము = బుద్ధి; కలిగి = కలిగి; ఉండవు = ఉండవు; నియమంబు = కట్టుబాటు; ఎక్కడిది = అసలు లేదు; నీకున్ = నీకు; మఱచినన్ = ఆదమరచినచో; చక్కగన్ = చక్కగా; పోయెదవు = వెళ్ళిపోయెదవు; పెక్కు = అనేకమైన; జాడలన్ = దార్లమ్మట; పుత్రా = కొడుకా.

<u>భావము</u>:- కన్నా! ఎక్కడబడితే అక్కడ తిరుగుతూ ఉంటావు. ఒకచోట కుదురుగా, బుద్ధి కలిగి ఉండవు కదా. నీకు పద్ధతి ప్రకారం ఉండటం అంటూ లేదా ఏమిటి? ఒక్క క్షణం ఏమరుపాటు చెందితే చాలు ఎన్నివేషాలైనా వేసి, ఎక్కడికైనా పోతావురా కొడుకా!
ఇలా యశోదాదేవి తన కొడుకు కృష్ణుని దెబ్బలాడుతూంటే కూడా తత్వమే కనబడుతోందట. "భగవంతుడవు సర్వాంతర్యామివి, ఎక్కడైనా తిరుతావు. గుణాతీతుడవు, నీవు బుద్ధికలిగి కూర్చోడం ఏమిటి? సర్వోన్నతుడవు నియమాలు ఎవరు పెట్టగలరు? ఈ ఎరుక మరచి ఒక్క క్షణం ఏమరుపాటు చెందితే చాలు. మిత్రులు, శత్రులు మొదలైన అనేకంగా కనిపిస్తావు కదయ్యా!" . . . అవును ఆత్మావైపుత్రా అంటారు పెద్దలు.

*10.1-377-సీ.
<u>తో</u>యంబు లివి యని <u>తొ</u>లగక చొచ్చెదు-
    <u>త</u>లఁచెదు గట్టెనఁ <u>ద</u>రల నెత్త;
<u>మం</u>టితో నాటలు <u>మా</u>నవు; కోరాడె-
    <u>దు</u>న్నత స్తంభంబు <u>లూ</u>పఁ బోయె;
<u>ధ</u>న్యుల నల్పంబు <u>ల</u>డుగంగఁ బాఱెదు-
    <u>రా</u>చవేఁటలఁ జాల <u>ఱ</u>వ్వఁదెచ్చె;
<u>ద</u>లయవు నీళ్ళకు <u>న</u>డ్డంబు గట్టెదు-
    <u>ము</u>సలివై హలివృత్తి <u>మొ</u>నయఁ; జూచె

10.1-377.1-ఆ.

దంబరంబు మొలకు నడుగవు తిరిగెద
వింకఁ గల్కిచేఁత లేల పుత్ర!
నిన్ను వంప ప్రాల్ప నే నేర ననియొ నీ
విట్టు క్రింద మీఁదు నెఱుఁగ కునికి.”

టీక:- తోయంబులు = నీళ్ళు; ఇవి = ఇవి; అని = అని; తొలగక = తప్పుకొనక; చొచ్చెదు = ప్రవేశించెదు (మత్స్యావతార సూచన); తలచెదు = ప్రయత్నించెదవు; గట్టైనన్ = కొండనైన; తరలనెత్తన్ = లేవనెత్తుటకు (కూర్మావతార సూచన); మంటిలోన్ = మట్టిలో; ఆటలు = ఆటలాడుట; మానవు = వదలవు; కోరాడెదు = గుచ్చియెత్తదవు (వరాహావతార సూచన); ఉన్నత = ఎత్తైన; స్తంభంబులున్ = స్తంభములను; ఊపబోయెదు = ఊపుటకుపోయెదవు (నరసింహావతార సూచన); అన్యులన్ = పరులను; అల్పంబులు = చిన్నవి; అడుగన్ = అర్థించుటకు; పాఱెదు = వెళ్ళెదవు (వామనావతార సూచన); రాచ = పెద్ద (రాజులను); వేటలన్ = పేటలందు (వేటాడుటందు); చాలన్ = మిక్కిలి; అవ్వ = అపకీర్తి (గొడవలు); తెచ్చెదు = తీసుకు వస్తావు (పరశురామావతార సూచన); అలయవు = అలసటన్నది లేదు; నీళ్ళు = జలముల; కున్ = కు; అడ్డంబున్ = కట్టను; కట్టెదు = కట్టుదువు (రామావతార చూచన); ముసలివి = వయసు మీరిన వాడవు (ముసలము ధరించినవాడవు); ఐ = అయ్యి; హలి = రైతువలె (జలధారివి); వృత్తిన్ = వలె; మొనయజూచెదు = ప్రవేశింపచూచెదవు (బలరామావతార సూచన); అంబరంబున్ = బట్టలు.
మొలకున్ = మొలకి కట్టుకొనుటకు; అడుగవు = కోరవు (బౌద్ధావతార సూచన); తిరిగెదవు = నడచెదవు; ఇంకన్ = మళ్ళీ; కలికి = జగడపు; చేతలు = పనులు; ఏలన్ = ఎందుకు (కల్క్యవతార సూచన); పుత్ర = కొడుకా; నిన్నున్ = నిన్ను; వంపన్ = వంచుటకు; ప్రాల్చన్ = అణచుటకు; నేన్ = నేను; నేరను = అసమర్థురాలను; అనియొ = అనా; నీవు = నీవు; ఇట్టు = ఇలా; కిందుమీదున్ = కిందమీద; ఎఱుగకున్ = తెలియకవర్తించుట (అలక్ష్యమున); కిన్ = కుకారణము.

భావము:- ఒరే కన్నయ్యా! అల్లరి పిల్లాడా! అదురు బెదురు లేకుండా నీళ్ళలో చొరబడి పోతావు! (మత్స్యావతారుడవుగా నీళ్ళల్లో తిరిగావు కదా). ఎంత పెద్ద బండైనా ఎత్తేయాలని చూస్తావు! (కూర్మావతారుడవుగా మందరపర్వతాన్ని ఎత్తావు కదా). పరాయి వాళ్ళ దగ్గర అల్ప మైన వాటికోసం చెయ్యి చాస్తావు! (వామనాతారుడవుగా రాక్షసచక్రవర్తి బలివద్ద చెయ్యిచాపావు కదా). నీకు రాజసం ఎక్కువ ఎన్నో జగడాలు తెస్తావు! (పరశురామావతారుడవుగా రాజలోకాన్ని సంహరించావు కదా). నీళ్ళ ప్రవాహానికి అడ్డకట్టలు వేయాలని చూస్తావు! (రామావతారుడవు సముద్రానికే సేతువు కట్టావు కదా). దుడ్డుకఱ్ఱ పట్టుకొని నాగలిదున్నే వాడిలా నటిస్తావు!

(బలరామావాతారుడవుగా ముసలము పట్టావు కదా). మొలకు గుడ్డ లేకుండా దిగంబరంగా తిరుగుతావు! (బుద్ధావతారుడవుగా సన్యాసిగా ప్రకాశించావు కదా). ఇవి చాలవు నట్లు ఇంకా దుడుకు చేష్ట లెందుకు చేస్తావో ఏమిటో? (ఇక ముందు కల్కి అవతార మెత్తి దుష్టులను శిక్షించడానికి ఏవేం చేస్తావో). నిన్ను నేను భయభక్తులలో పెట్టలేను అనుకునేగా ఇలా కింద మీద తెలియకుండ మిడిసిపడు తున్నావు! (త్రివిక్రమావతారుడవుగా బ్రహ్మాండభాండందాటి ఎదిగిపోయావు కదా). ఇలా ఎత్తిపొడుపు మాటలతో తల్లి యశోదాదేవి కొంటెకొడుకును దెప్పుతోంది.

చమత్కారమైన అలంకారం నిందాస్తుతి. ఓ ప్రక్కన నిందిస్తున్నా, స్తుతి పలుకుతుంటే నిందాస్తుతి అంటారు. ఇలా అల్లరి కృష్ణబాలుని యశోద దెప్పటంలో నిందాస్తుతితో బహు చక్కగా అలరించారు మన పోతన్నగారు. ఆస్వాదిద్దాం రండి."

10.1-378-వ.

అని మర్మంబు లెత్తి పలికి.

<u>టీక</u>:- అని = అని; మర్మంబులు = ఎత్తిపొడుపుమాటలు; ఎత్తి = ఎత్తిపొడిచి; పలికి = అని.

<u>భావము</u>:- ఇలా ఎత్తిపొడుపు మాటలతో తల్లి యశోదాదేవి కొంటెకొడుకును దెప్పుతూ.......

10.1-379-క.

ఆ **ల**లన గట్టె ఱోలన్
<u>లీ</u>**లన్** నవనీతచౌర్య<u>లీ</u>లుం బ్రియ వా
గ్జా**లుం** బరివిస్మిత గో
<u>పా</u>**లున్** ముక్తాలలామ <u>ఫా</u>లున్ బాలున్.

<u>టీక</u>:- ఆ = ఆ; లలన = ఇంతి; కట్టెన్ = కట్టివేసెను; ఱోలన్ = రోటికి; లీలన్ = అవలీలగా; నవనీతచౌర్యలీలున్ = వెన్నదొంగను; ప్రియ = ఇంపైన; వాక్ = మాటల; జాలున్ = అనేకము పలుకు వానిని; పరి = మిక్కిలిగా; విస్మిత = ఆశ్చర్యపోతున్న; గోపాలున్ =కృష్ణుని; ముక్తా = ముత్యాల; లలామ = ఆభరణము; ఫాలున్ = నుదుట కలవానిని; బాలున్ = బాలకృష్ణుని.

<u>భావము</u>:- ఇలా యశోద అవతార రహస్యాలు ఎత్తుకుంటూ దొంగకృష్ణుని ఎత్తిపొడిచి, అతనిని ఒక రోలుకి కట్టేసింది. ఆ దుడుకు పిల్లాడు వెన్నదొంగిలించటమనే క్రీడ కలవాడు, సంతోషాలు పంచుతూ గలగలా మాట్లాడు వాడు. తల్లి తనను కట్టిసినందుకు ఆశ్చర్యపోతున్నట్లు కనబడుతున్న గొల్లపిల్లాడు. ముత్తెపుబొట్టు నుదుట అలంకారంగా మెరుస్తున్న వాడు.

*10.1-380-క.



ఱో**ల**ను గట్టుబడియు న

బ్బా**లు**ఁడు విలసిల్లె భక్త పరతంత్రుండై

యా**లా**న సన్నిబద్ధ వి

శా**ల** మదేభేంద్రకలభ సమరుచి నధిపా!

టీక:- ఱోలను = రోటికి; కట్టుపడియున్ = కట్టివేయబడి; ఆ = ఆ; బాలుడు = బాలకృష్ణుడు; విలసిల్లెన్ = ఒప్పెను; భక్త = భక్తులకు; పరతంత్రుండు = లోబడునట్టివాడు; ఐ = అయ్యి; ఆలాన = ఏనుగు కట్టుకొయ్యకు; సత్ = మిక్కిలి; నిబద్ధ = కట్టివేయబడినట్టి; విశాల = అధికమైన, పెద్దదైన; మద = మదించిన; ఇభ = ఏనుగు; ఇంద్ర = శ్రేష్ఠము; కలభ = గున్నలో; సమ = సమానమైన; రుచిన్ = ప్రకాశములో; అధిపా = రాజా.

భావము:- పరీక్షిన్మహారాజా! బాలగోపాలుడు భక్తుల వశంలో ఉండే వాడు గనుక తను రోటికి కట్టిబడిపోయి ఉన్నాడు. దానికి అతడు ఏమాత్రం బిక్కమొగం వేయలేదు. పైగా కట్టుకొయ్యకు కట్టబడిన గున్న ఏనుగు వలె హుందాగా వెలిగిపోతున్నాడు.

10.1-381-క.

వె**లి** లోను మొదలు దుది నడు

ము**లు** లేక జగంబు తుదియు మొదలున్ నడుమున్

వె**లి**యున్ లో నగు నీశ్వరు

న**ల**వడునే కట్టఁ బ్రణతురాల్ గా కున్నన్?

టీక:- వెలి = బయట; లోనున్ = లోపల; మొదలున్ = ఆది; తుది = అంతము; నడుములు = మధ్యభాగములు; లేక = కలుగక (పూర్ణుడు, ఏకము); జగంబున్ = విశ్వమునకు; తుదియున్ = అంతము; మొదలున్ = ఆది; నడుమున్ = మధ్యలోను; వెలియున్ = బయట; లోనన్ = లోపల; అగు = ఐ ఉండెడి; ఈశ్వరున్ = సర్వనియామకుని; అలవడునే = వీలగునా, వీలుకాదు; కట్టన్ = కట్టివేయుటకు; ప్రణతురాల్ = భక్తురాలు; కాకున్నన్ = కాకపోయినచో.

భావము:- విష్ణుమూర్తికి లోపల, వెలుపల అనేవీ, మొదలు, చివర, మధ్య అనేవి ఏమీలేవు; ఈ లోకాలు అన్నిటికీ మొదలు, చివర, మధ్య, లోపల, వెలుపల సర్వం అతడే; అటువంటి ఆయనను కట్టేయాలంటే, శరణాగతి చెందిన పరమభక్తురాలు గనుక యశోదకు సాధ్యం అయింది కాని, లేకపోతే సాధ్యం కాదు గదా?

10.1-382-ఆ.

పట్టి యెల్లబోఁటి పట్టి యీతం డని
గట్టితలఁపుతోడఁ గట్టెఁ గాక
పట్టికడుపు పెక్కు బ్రహ్మాండములు పట్టు
టెఱిఁగి నేని దల్లి యేల కట్టు?

టీక:- పట్టి = పట్టుకొని; ఎల్లబోటి = అందరి లాంటి; పట్టి = కుమారుడు; ఈతండున్ = ఇతను; అని = అని; గట్టి = దృఢమైన; తలపు = భావము; తోడన్ = తోటి; కట్టెన్ = కట్టివేసెను; కాని = అంతే తప్పించి; పట్టి = బాలకృష్ణుని; కడుపు = బొజ్జ; పెక్కు = అనేకములైన; బ్రహ్మాండములున్ = విశ్వగోళములు; పట్టుటన్ = లోపల ఇమిడి ఉండుట; ఎఱిగినేని = తెలిసినచో; తల్లి = తల్లి; ఏలన్ = ఎలా, ఎందుకు; కట్టున్ = కట్టివేయును.

భావము:- యశోదాదేవి తన చిన్నికృష్ణుడు కూడా అందరి లాంటి బాలుడే అనుకుంది గనుక అతణ్ణి కట్టగలిగింది; అలాకాక, అనేకమైన బ్రహ్మాండాలు ఆ బాలుని కడుపులో ఉంటాయని తెలిస్తే ఆ తల్లి కట్టేయదు కదా?

*10.1-383-క.

చిక్కఁడు సిరికౌగిటిలోఁ
జిక్కఁడు సనకాది యోగిచిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావళిఁ
జిక్కె నతఁడు లీలఁ దల్లి చేతన్ ఱోలన్

టీక:- చిక్కడు = చిక్కుకొనడు; సిరి = లక్ష్మీదేవి యొక్క; కౌగిటి = రెండు చేతుల నడుమ. కౌగిలి; లోన్ = అందును; చిక్కడు = దొరకడు; సనక = సనకాదులు {సనకాది - 1సనక 2సనందన 3సనత్కుమార 4సనత్సుజాతులు అనెడి ఆది యోగులు, బ్రహ్మదేవుని కొడుకులు}; ఆది = మున్నగు; యోగి = యోగుల; చిత్త = మనసు లనెడి; అబ్జములన్ = పద్మముల నైనను; చిక్కడు = కట్టుబడడు; శ్రుతి = వేదము లనెడి; లతికా = తీగల; ఆవళిన్ = సమూహమున కైనను; చిక్కెను = దొరికెను; అతడు = అట్టివాడు; లీలన్ = అవలీలగా, మాయతో; తల్లి = తల్లి యొక్క; చేతన్ = చేతిలో; ఱోలన్ = రోటికి.

భావము:- ఆ లీలా గోపాలకృష్ణుడు సామాన్యమైనవాడా కాదు. లక్ష్మీదేవి కౌగిటలోను చిక్కలేదు, సనకసనందాది మహర్షుల చిత్తాలకు చిక్కలేదు. ఉపనిషత్తులకు చిక్కలేదు. ఆహా! అంతటి వాడు లీలగా అవలీలగా తల్లి చేతికి చిక్కి రోటికి కట్టివేయబడ్డాడు. భక్తపరాధీనుడు గనుక తల్లి యనే మిషచే తనకు అంతరంగ భక్తురాలు గనుక యశోదచేతికి చిక్కాడు.

10.1-384-వ.

ఇట్లు గ్రద్దన నా ముద్దియ ముద్దులపట్టి యుదరంబు గట్ట నడరుచుఁ జతురంబుగఁ జక్క నొక్కత్రాడు చుట్టిన నది రెండంగుళంబులు కడమపడియె; మఱియు నొక్క బంధనంబు సంధించి వలగొనిన నంతియ కొఱంత యయ్యెఁ; వెండియు నొక్కపాశంబు గూర్చి పరివేష్టించిన వెల్తిఁ జూపె; నిట్లు.

<u>టీక</u>:- ఇట్లు = ఈ విధముగ; గ్రద్దనన్ = చటుక్కున; ఆ = ప్రసిద్ధురాలైన; ముద్దియ = ముద్దరాలు; ముద్దుల = గారాల; పట్టిన్ = పుత్రుని; ఉదరంబున్ = కడుపును; కట్టన్ = కట్టివేయుటకు; అడరుచున్ = పూనుచు; చతురంబుగన్ = నేర్పుగా; చక్కన్ = సరిగా; ఒక్క = ఒకానొక; త్రాడున్ = తాడు; చుట్టినన్ = చుట్టగా; అది = ఆ తాడు; రెండు = రెండు (2); అంగుళంబులున్ = అంగుళములు; కడమ = తక్కువ; పడియెన్ = అయ్యెను; మఱియున్ = ఇంకను; ఒక్క = ఒకానొక; బంధంబున్ = తాడు; సంధించి = కలిపి, ముడివేసి; వలగొనినన్ = చుట్టూ తిప్పగా; అంతియన్ = అంతే; కొఱంత = తక్కువ; అయ్యెన్ = పడినది; వెండియున్ = ఇంకను; ఒక్క = ఒకానొక; పాశంబున్ = తాడు; కూర్చి = ముడివేసి; పరివేష్టించినన్ = చుట్టూ తిప్పినను; వెల్తి = తక్కువగుట; చూపెన్ = కనబడెను; ఇట్లు = ఈ విధముగ.

<u>భావము</u>:- ఇలా తన ముద్దుల కొడుకును కట్టటానికి ఒక త్రాడు తెచ్చి నడుం చుట్టూ చుట్టబోయింది. అది 2 అంగుళాలు తక్కువైంది. మరో త్రాడు జతచేసినా అదే 2 అంగుళాలు తక్కువైంది. మరొక్క త్రాడు ముడేసినా అంతే తక్కువైంది. ఇలా....

10.1-385-క.

త**జ్జ**నని లోఁగిటం గల
<u>ర</u>**జ్జు**పరంపరలఁ గ్రమ్మ<u>ఱన్</u> సుతుఁ గట్టన్
బొ**జ్జ** దిరిగి రా దయ్యెఁ జ
<u>గ</u>**జ్జా**లము లున్న బొజ్జఁ <u>గ</u>ట్టన్ వశమే?

<u>టీక</u>:- తత్ = ఆ; జనని = తల్లి; లోగిటన్ = ఇంటిలో; కల = ఉన్నట్టి; రజ్జు = తాళ్ళ; పరంపరలన్ = సమూహములచే; క్రమ్మఱన్ = మరల; సుతున్ = పుత్రుని; కట్టన్ = కట్టబోగా; బొజ్జ = కడుపు; తిరిగి = చుట్టుతిరిగి; రాదు = అందనిది; అయ్యెన్ = అయినది; జగజ్జాలములున్ = ఎల్లలోకములు; ఉన్న = లోనున్న; బొజ్జ = కడుపును; కట్టన్ = కట్టివేయుట; వశమే = శక్యమా, కాదు.

<u>భావము</u>:- ఆ యమ్మ ఇంట్లో ఉన్న తాళ్ళన్నీ వరుసగా కలిపినా అంతే వెలితి ఉండిపోయింది. ముజ్జగములూ దాగి ఉన్న ఆ చిరుబొజ్జను కట్టటం ఎవరి తరం?

10.1-386-వ.

అప్పు డా యవ్వయు గోపికలును వెఱంగుపడిరి; తదనంతరంబ

టీక:- అప్పుడు = ఆ సమయమునందు; అవ్వయున్ = తల్లి; గోపికలునున్ = గోపికలు; వెఱంగుపడిరి = ఆశ్చర్యపోయిరి; తదనంతరంబ = ఆ తరువాత.

భావము:- ఆప్పుడు ఆ వింతను, పిల్లాణ్ణి చూసి యశోదా, గోపికలూ నివ్వెరపోయారు. పిమ్మట...

10.1-387-ఆ.

ఒడలఁ జెమట లెగయ నుత్తరీయము జాఱ
వీడి యున్న తుఱుము విరులు రాలఁ
గట్టరాని తన్నుఁ గట్టెద నని చింతఁ
గట్టుకొనిన తల్లిఁ గరుణఁ జూచి.

టీక:- ఒడలన్ = ఒంటినిండా; చెమటల్ = చెమట; ఎగయన్ = ఎగజిమ్మగా; ఉత్తరీయమున్ = కొంగు; జాఱన్ = జారిపోగా; వీడి = వదులైపోయి; ఉన్న = ఉన్నట్టి; తుఱుమున్ = జుట్టుముడినుండి; విరులు = పువ్వులు; రాలన్ = రాలిపోతుండగా; కట్టరాని = లోబడజేసుకొన నశక్య మైన; తన్నున్ = తనను; కట్టెదను = కట్టివేసెదను; అని = అనెడి; చింతన్ = విచారము; కట్టుకొనిన = మూటగట్టుకొనిన; తల్లిన్ = తల్లిని; కరుణన్ = దయతో; చూచి = చూసి.

భావము:- పడుతున్న శ్రమకు యశోద శరీరమంతా చమటలు పట్టాయి. కొప్పు వదులైపోయి పువ్వులు రాలిపోయాయి. అలా కట్టటానికి శక్యంకాని తనను కట్టాలనే పట్టుదలతో తల్లి పడుతున్న తంటాలు చూసి నల్లనయ్య జాలి పడి......

10.1-388-క.

బంధవిమోచనుఁ డీశుఁడు
బంధింపఁ బెనంగు జనని పాటోర్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ
బంధంబునఁ గట్టుబడియెఁ బాటించి నృపా!

టీక:- బంధ = సంసారబంధములను; విమోచనుడు = తొలగించువాడు; ఈశుడు = భగవంతుని, బాలకృష్ణుని; బంధింపన్ = కట్టివేయుటకు; పెనంగు = పెనగులాడుచున్నట్టి; జనని = తల్లి; పాటున్ = శ్రమను; ఓర్చి = సహించి; సుహృత్ = ఆప్తులకు; బంధుడు = బంధువు; కావునన్ = కనుక; జననీ = తల్లి యొక్క; బంధంబునన్ = బంధింపబడుటకు; కట్టుపడియెన్ = కట్టుబడిపోయెను; పాటించి = పూని; నృపా = రాజా.

భావము:- ఓ పరీక్షిన్మహారాజా! భగవంతుడు, భవబంధాలను తొలగించి మోక్షాన్ని ప్రసాదించేవాడు అయిన కృష్ణబాలుడు కన్నతల్లి కష్టం చూడలేక అలా త్రాడుకి కట్టుపడిపోయాడు; అతడు ఆప్తులైన వారికి ఆత్మబంధువు గదా!

10.1-389-క.

సంగడిఁ దిరిగెడు శంభుఁడు

<u>నం</u>గాశ్రయ యైన సిరియు <u>నా</u>త్మజుఁడై యు

ప్పొంగెడు పద్మజుఁడును గో

<u>పాం</u>గన క్రియఁ గరుణ పడయ <u>ర</u>ఖిలేశ్వరుచేన్.

<u>టీక</u>:- సంగడిన్ = పార్శ్వమున; తిరిగెడు = వర్తించెడి; శంభుడున్ = పరమశివుడు; అంగ = దేహమును; ఆశ్రయ = చేరి ఉండెడి ఆమె; ఐన = అయిన; సిరియున్ = లక్ష్మీదేవి; ఆత్మజుడున్ = తనకు కలిగినవాడు; ఐ = అయ్యి; ఉప్పొంగెడు = సంతోషించు నట్టి; పద్మజుడు = బ్రహ్మదేవుడు; గోప = నందగోపకుని; అంగన = భార్య; క్రియన్ = వలె; కరుణ = కృపను; పడయరు = పొందరు; అఖిలేశ్వరు = నారాయణుని {అఖిలేశ్వరుడు - సర్వేశ్వరుడు, విష్ణువు}.

<u>భావము</u>:- ఆయనతో ప్రియమిత్రుడై మెలగే శంకరుడు గానీ, ఆయన వక్షస్థలాన్ని ఆశ్రయించుకొని ఉండే లక్ష్మీదేవి గానీ, ఆయన కొడుకును అని ఉప్పొంగిపోయే బ్రహ్మదేవుడు గానీ శ్రీకృష్ణుని వలన యశోద పొందిన అనుగ్రహాన్ని పొందలేకపోయారు.



10.1-390-క.

జ్ఞానులచే మౌనులచే

<u>దా</u>నులచే యోగ సంవి<u>ధా</u>నులచేతం

బూని నిబద్ధుం డగునే

శ్రీనాథుఁడు భక్తియుతుల<u>చే</u>తం బోలెన్?

<u>టీక</u>:- జ్ఞానులు = అధిక జ్ఞానము కలవారు; చేన్ = వలన; మౌనులు = మునుల; చేన్ = వలన; దానులు = దాతల; చేన్ = వలన; యోగ = యోగవిద్యా; సంవిధానుల = బాగుగా అభ్యసించు వారి; చేతన్ = వలన; పూని = ప్రయత్నించి; నిబద్ధుండు = కట్టిబడినవాడు; అగునే = అగునా, కాడు; శ్రీనాథుడు = లక్ష్మీపతి, విష్ణువు; భక్తియుతుల = భక్తి గల వారి; చేతన్ = వలన; పోలెను = విధముగా.

<u>భావము</u>:- భక్తులకు పట్టుబడినట్లు భగవంతుడు జ్ఞానులకు గానీ, మునులకు గానీ, దాతలకు గానీ, యోగీశ్వరులకు గానీ పట్టుబడడు గదా!

10.1-391-వ.

అంత నయ్యశోద యింటికడఁ బనులవెంటందిరుగఁ గృష్ణుఁడు తొల్లి నారదు శాపంబున నిరుమద్దులై యున్న నలకూబర మణిగ్రీవు లను గుహ్యకుల నిద్దఱం గని ఱో లీడ్చుకొని చనియె"నని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డిట్లనియె.

<u>టీక</u>:- అంతన్ = అప్పుడు; ఆ = ఆ; యశోద = యశోద; ఇంటి = ఇంటి; కడన్ = వద్ద; పనుల = ఉన్నట్టి పనులు; వెంటన్ = అందు; తిరుగన్ = మెలగుచుండగా; కృష్ణుడు = బాలకృష్ణుడు; తొల్లి = పూర్వము; నారదు = నారదుని యొక్క; శాపంబునన్ = శాపమువలన; ఇరు = జంట; మద్దులు = మద్దిచెట్లు; ఐ = అయ్యి; ఉన్న = ఉన్నట్టి; నలకూబర = నలకూబరుడు {నలకూబరుడు - నల (నల్లటి) కూబర (మనోజ్ఞము) యైన వాడు}; మణిగ్రీవులు = మణిగ్రీవుడు {మణిగ్రీవుడు - మణి (శ్రేష్ఠమైన) గ్రీవుడు (కంఠము) కలవాడు}; అను = అనెడి; గుహ్యకులన్ = దేవయోని వారలను; ఇద్దఱన్ = ఇద్దరిని; కని = కనుగొని; ఱోలు = రోలును; ఈడ్చుకొని = కూడ లాగుచు; చనియెన్ = వెళ్ళెను; అని = అని; చెప్పినన్ = చెప్పగా; శుక = శుకుడు అనెడి; యోగి = యోగులలో; వరున్ = ఉత్తమున; కున్ = కు; భూవరుండు = రాజు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

<u>భావము</u>:- తల్లి యశోదాదేవి కొడుకు కృష్ణుని అలా రోటికి కట్టివేసి, ఇంట్లో పనులు చేసుకోవటంలో మునిగిపోయింది. నలకూబరుడు, మణిగ్రీవుడు అనే ఇద్దరు యక్షులు నారదుని శాపం వలన చాలాకాలంనుంచి రెండు పెద్దపెద్ద మద్దిచెట్లుగా పడి ఉన్నారు. కృష్ణబాలుడు ఆ మద్దిచెట్ల జంటను చూసాడు. రోలును ఈడ్చుకుంటూ ఆ చెట్ల దగ్గరకు వెళ్ళాడు"ఇలా శుకబ్రహ్మ చెప్పగా విన్న మహారాజు ఇలా అడిగాడు.

## గుహ్యకుల నారదశాపం

10.1-392-క.

"నా**ర**దుఁ డేల శపించెను?

<u>వా</u>**రా** వృక్షత్వమునకు <u>వ</u>చ్చిన పనికిం

గా**ర**ణ మెయ్యది? యోగికు

<u>లా</u>**రా**ధ్య! యెఱుంగఁ జెప్పు <u>మ</u>య్య! వినియెదన్."

<u>టీక</u>:- నారదుడు = నారదుడు; ఏలన్ = ఎందుకు; శపించెను = శాపము ఇచ్చెను; వారున్ = వారు; ఆ = అట్టి; వృక్షత్వమున్ = చెట్లుగా ఐపోవుట; కున్ = కు; వచ్చిన = దారితీసిన; పని = చేష్ట; కిన్ = కి; కారణము = హేతువు; ఎయ్యది = ఏమిటి; యోగి = యోగులు; కుల = అందరిచేత; ఆరాధ్య = పూజింపబడువాడ; యెఱుంగన్ = తెలియునట్లు; చెప్పుము = తెలుపుము; అయ్య = తండ్రి; వినియెదన్ = వింటాను.

<u>భావము</u>:- "ఓ యోగివరేణ్యా! శుకా! లోకంలోని యోగులందరూ నిన్ను సేవిస్తూ ఉంటారు. ఆ యక్షులను నారదుడు ఎందుకు శపించాడు; వారికి అలా చెట్లుగా పడిఉండే శాపం రావటానికి వారు చేసిన అపచారం ఏమిటి? ఆ వివరం తెలియజెప్పు వింటాను."

10.1-393-వ.

అనిన శుకుండిట్లనియె “మున్ను కుబేరుని కొడుకు లిరువురు శంకరకింకరులై యహంకరించి వెండికొండమీఁద విరుల తోఁటలం బాడెడి చేడియలం గూడికొని కరేణు సంగతంబు లైన యేనుంగుల భంగి సురంగంబు లైన మందాకినీతరంగంబులం గ్రీడింప నారదుండు వచ్చిన న చ్చెలువలు చెచ్చెర వలువలు ధరియించిరి; మదిరాపాన పరవశులు గావున వార లిరువురు వివస్త్రులై మెలంగుచున్న నా మునీశ్వరుండు చూచి శపియించు వాఁడై ప్రతీతంబగు గీతంబు పాడె; వినుము.

టీక:- అనినన్ = అనగా; శుకుండు = శుకుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను; మున్ను = పూర్వము; కుబేరుని = కుబేరుని యొక్క; కొడుకులు = పుత్రులు; ఇరువురు = ఇద్దరు; శంకర = పరమశివుని; కింకరులు = సేవకులు; ఐ = అయ్యి; అహంకరించి = గర్వించి; వెండికొండ = కైలాసపర్వతము; మీదన్ = పైన; విరుల = పూల; తోటలన్ = తోటలలో; పాడెడి = పాటలు పాడునట్టి; చేడియలన్ = స్త్రీలను; కూడికొని = కలిసి; కరేణు = ఆడు ఏనుగులతో; సంగతంబులు = కూడుకొన్నవి; ఐన = అయినట్టి; ఏనుంగుల = ఏనుగుల; భంగిన్ = వలె; సురంగంబులు = చక్కగా వ్యాపించునవి; ఐన = అయిన; మందాకినీ = గంగానదిలోని; తరంగంబులన్ = అలల యందు; క్రీడింపన్ = విహరించుచుండగా; నారదుండు = నారదుడు; వచ్చినన్ = రాగా; ఆ = ఆ; చెలువలు = స్త్రీలు; చెచ్చెరన్ = వెంటనే; వలువలున్ = బట్టలను; ధరియించిరి = కట్టుకొనిరి; మదిరా = మద్యము; పాన = తాగుటచే; పరవశులు = ఒళ్ళు మరచినవారు; కావునన్ = కనుక; వారలు = వారు; ఇరువురున్ = ఇద్దరు; వివస్త్రులు = దిగంబరులు; ఐ = అయ్యి; మెలంగుచున్నన్ = సంచరిస్తుండగా; ఆ = ఆ; ముని = మునులలో; ఈశ్వరుండు = శ్రేష్ఠుడు; చూచి = కనుగొని; శపియించు = శాపము ఇచ్చెడి; వాడు = వాడు; ఐ = అయ్యి; ప్రతీతంబు = ప్రసిద్ధము; అగు = ఐన; గీతంబున్ = గీతమును; పాడెన్ = పాడెను; వినుము = విను.

భావము:- అలా పరీక్షిత్తు అడుగగా శుకుడు ఇలా చెప్పసాగాడు "పూర్వం కుబేరుడి కుమారులు ఇద్దరు నలకూబరుడు, మణిగ్రీవుడు అనేవారు శంకరునికి సేవకులుగా ఉండేవారు, యక్షుల రాకుమారులము, పైగా పరమశివుని అనుచరులము గదా అని అహంకారంతో వారు సంచరిస్తూ ఉండేవారు. ఒకరోజు వారిద్దరూ వెండికొండమీద ఉద్యానవనాలలో తమ ప్రియురాళ్ళతో కలిసి విహరిస్తున్నారు. ఆ గంధర్వకన్యలు చాలా మనోహరంగా పాటలు పాడుతున్నారు. ఇలా ఆడ ఏనుగులతో కూడిన మదపుటేనుగులులాగా తమ కాంతలతో అందమైన ఆకాశగంగా తరంగాలలో జలక్రీడలు సాగిస్తున్నారు. ఇంతలో ఆ మార్గాన నారదమహర్షి వచ్చాడు. ఆయనను చూసి గంధర్వ కాంతలు గబగబా బట్టలు ధరించారు. మద్యం కైపులో మునిగి ఉన్న నలకూబర

మణిగ్రీవులు మాత్రం దిగంబరులుగానే తిరుగుతున్నారు. వారిని చూసిన నారదుడు శపించబోతూ ఒక ప్రసిద్ధమైన గీతాన్ని పాడాడు. దానిని విను;

10.1-394-శా.

"సంపన్నుం డొరుఁ గాన లేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తుబడి శుష్కీభూతుఁడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సముల కాఁ జింతించు నట్లౌటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్."

టీక:- సంపన్నుండు = ధనవంతుడు; ఒరున్ = ఇతరుని; కానలేడు = లెక్కజేయలేడు; తనువున్ = తన దేహమును; సంసారమున్ = సంసారమును; నమ్మి = విశ్వసించి; హింసింపన్ = బాధించుటకు; చూచున్ = ప్రయత్నించును; దరిద్రుడు = పేదవాడు; ఎత్తుబడి = దీనత్వమును పొంది; శుష్కీభూతుడు = కృశించిపోయినవాడు; ఐ = అయ్యి; చిక్కి = సన్నబడిపోయి; హింసింపడు = బాధింపడు; అన్యులన్ = ఇతరులను; ఆత్మ = తన; కున్ = లో; సములన్ = సమానమైనవారి; కాన్ = ఐనట్లు; చింతించున్ = భావించును; అట్లు = అలా; ఔటన్ = అగుటచేత; తత్ = ఆ; సంపన్న = కలిగిన సంపదలు వలన; అంధున్ = గుడ్డివాడైనవాని; కిన్ = కి; అంజనంబు = కళ్ళు తెరిపించునది; అగున్ = అగును; సుమా = సుమా; దారిద్ర్యము = బీదతనము; ఊహింపగన్ = యోచించినచో.

భావము:- ధనవంతుడు ఎవరినీ లెక్కచేయడు; తన ధనాన్నీ, శరీరాన్నీ, సంసారాన్నీ నమ్ముకుని ఇతరులను హింసించాలని చూస్తాడు; దరిద్రుడు దారిద్ర్యదేవతకు చిక్కి కష్టాలలో బక్కచిక్కినా ఇతరులను హింసించడు; వాళ్ళు కూడా తనలాంటివారే కదా అని భావిస్తాడు; ఇది లోకరీతి; విను, కనుక ధనమదాంధులైన వారికి దరిద్రమే చక్కని కళ్ళు తెరిపించే మందు అవుతుంది;"

10.1-395-వ.

అని గీతంబు వాడి తన మనంబున.

టీక:- అని = అని; గీతంబున్ = గీతమును; పాడి = ఆలపించి; తన = తన యొక్క; మనంబునన్ = మనసునందు.

భావము:- ఇలా గీతం పాడిన నారదుడు తన మనసులో . .

10.1-396-క.

"కలవాని సుతుల మనుచును
గలకంఠులలోడఁ గూడి కానరు పరులం
గలలో నైనను; వీరికిఁ
గల క్రొవ్వడఁగించి బుధులఁ గలపుట యొప్పున్."

టీక:- కలవాని = సంపన్నుని; సుతులము = పుత్రులము; అనుచున్ = అని యెంచుకొని; కలకంఠులు = సుందరీమణుల {కలకంఠి - కోయిలవంటి గొంతు కలామె, స్త్రీ}; తోడన్ = తోడి; కూడి = చేరి; కానరు = లక్ష్యపెట్టరు; పరులన్ = ఇతరులను; కల = స్వప్నము; లోన్ = అందు; ఐనను = అయినప్పటికి; వీరి = వీరల; కిన్ = కు; కల = కలిగినట్టి; క్రొవ్వు = గర్వము; అడగించి = అణచివేసి; బుధులన్ = జ్ఞానులందు; కలపుట = చేర్చుట; ఒప్పున్ = చక్కనిపని.

భావము:- "ఈ యక్షరాజు కుమారులు ధనవంతుని కొడుకులమని గర్వించి ఉన్నారు; పైగా ప్రేయసులతో కూడి ఉన్నారు. ఇక చెప్పేదేమి ఉంది. వీరికి కొవ్వు అణచి మళ్ళీ సత్పురుషులనుగా మార్చటం సముచితమైన పని."

10.1-397-వ.

అని చింతించి విజ్ఞాన విశారదుండగు నారదుండు నలకూబర మణిగ్రీవులఁ జూచి "మీరలు స్త్రీమదాంధులరు గావున భూలోకంబున నర్జున తరువులై నూఱు దివ్యవర్షంబు లుండుం డటమీఁద గోవిందచరణారవింద పరిస్పందంబున

టీక:- అని = అని; చింతించి = భావించి; విజ్ఞాన = విశిష్ట (బ్రహ్మ) జ్ఞానము; విశారదుండు = సమృద్ధిగా కలవాడు; అగు = ఐన; నారదుండు = నారదుడు {నారదుడు - నారములను ఇచ్చివాడు, బ్రహ్మమానస పుత్రుడు}; నలకూబర = నలకూబరుడు; మణిగ్రీవులన్ = మణిగ్రీవుడులను; చూచి = ఉద్దేశించి; మీరలు = మీరు; స్త్రీ = స్త్రీల సాంగత్యము గల; మద = గర్వమువలన; అంధులరు = గుడ్డివారైనవారు; కావునన్ = కనుక; భూలోకంబునన్ = మానవలోకమున; అర్జునతరువులు = మద్దిచెట్లు; ఐ = అయ్యి; నూఱు = వంద (100); దివ్యవర్షంబులు = దివ్యసంవత్సరములు; ఉండుడు = ఉండండి; అటమీద = ఆపైన; గోవింద = శ్రీకృష్ణుని {గోవిందః- గోవులకు ఇంద్రుడు, గో అనగా వాక్కు కనుక వాక్కు తెలియుట (వేదవిదుత్వము) కలిగించువాడు, శ్రీశంకరభాష్యం విష్ణుసహస్రనామములు 187వ నామం}; చరణ = పాదములు అనెడి; అరవింద = పద్మముల; పరిస్పందంబునన్ = తాకుటచేత, కదలుటచేత (శబ్దార్థ దీపిక).

భావము:- అని తన మనసులో ఆలోచించుకొని విశేషమైన జ్ఞానం కల నారదమహర్షి నలకూబర, మణికూబరులతో ఇలా అన్నాడు "మీరు స్త్రీఐశ్వర్యమదంతో కొట్టుకుంటున్నారు; కనుక భూమ్మీద వంద దివ్యసంవత్సరాల పాటు మద్దిచెట్లుగా పడి ఉండండి. ఆ తరువాత గోవిందుని పాదారవిందాల స్పర్శ లభించుటచేత;

10.1-398-క.

ముక్తులరై నారాయణ
భక్తులరై పరమసాధుభావ శ్రీ సం
సక్తులరై సురలోక
వ్యక్తుల రయ్యెదరు నాదువాక్యము కతనన్."

టీక:- ముక్తులరు = మోక్షము పొందినవారు; ఐ = అయ్యి; భక్తులరు = భక్తులైన వారు; ఐ = అయ్యి; పరమ = మిక్కిలి; సాధు = మంచి; భావ = స్వభావము అనెడి; శ్రీ = సంపత్తితో; సంసక్తులరు = బాగుగా కూడినవారు; ఐ = అయ్యి; సుర = దేవ; లోక = లోకపు; వ్యక్తులరు = తెలియబడు మూర్తులు; అయ్యెదరు = అగుదురు; నాదు = నా యొక్క; వాక్యము = మాట; కతనన్ = నిమిత్తముచేత.

భావము:- ఈ నా శాప విమోచన అనుగ్రహం వలన, ఆ యశోదానందనుని పాదారవిందస్పర్శతో విముక్తులు అవుతారు; ఆ విధంగా ముక్తులై, శ్రీమన్నారాయణుని భక్తులై సత్ప్రవర్తన యందు ఆసక్తి కలవారై మళ్ళీ దేవలోకంలో ప్రవేశిస్తారు."

## కృష్ణుడు మద్దిగవను గూల్చుట

10.1-399-వ.

అని యిట్లు పలికి నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె వారిరువురు సంగడిమద్దు లైరి, పరమభాగవతుండైన నారదు మాటలు వీటింబుచ్చక పాటించి.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; పలికి = శాపము ఇచ్చి; నారదుండు = నారదుడు; నారయణాశ్రమంబున్ = నారయణాశ్రమమున; కున్ = కు; చనియెన్ = వెళ్ళిపోయెను; వారున్ = వారలను; ఇరవురు = ఇద్దరు; సంగడిన్ = జంట, జోడు; మద్దులు = మద్దిచెట్లు; ఐరి = అయితిరి; పరమ = అత్యుత్తమమైన; భాగవతుండు = భాగవతుడు; ఐన = అయినట్టి; నారదు = నారదుని యొక్క; మాటలున్ = మాటలను; వీటింబుచ్చక = వ్యర్థము చేయక; పాటించి = ధరించి.

భావము:- ఇలా శాపమూ విమోచనమూ చెప్పి, నారదుడు నారయణాశ్రమానికి వెళ్ళిపోయాడు: వాళ్ళిద్దరు జంట మద్ది చెట్లుగా భూలోకంలో పక్కపక్కన పడిఉన్నారు, నారదమహర్షి పరమభాగవతోత్తముడు కనుక శ్రీకృష్ణపరమాత్మ ఆయన మాటలను పాటించదలచాడు.

10.1-400-క.

ముద్దుల తక్కరిబిడ్డఁడు
<u>మ</u>ద్దులఁ గూల్పంగ దలఁచి <u>మ</u>సలక తా నా
మద్దికవ యున్న చోటికిఁ
<u>గ్ర</u>ద్దన ఱో లీడ్చుకొనుచుఁ <u>గ</u>డకం జనియెన్.

<u>టీక</u>:- ముద్దుల = మనోజ్ఞమైన; తక్కరి = టక్కులమారి; బిడ్డడు = బాలకుడు; మద్దులన్ = మద్దిచెట్లను; కూల్పంగన్ = పడద్రోయవలెనని; తలచి = అనుకొని; మసలక = ఆలస్యము చేయక; తాన్ = అతను; ఆ = ఆ; మద్ది = మద్దిచెట్లు; కవ = జంట; ఉన్న = ఉన్నట్టి; చోటు = స్థలమున; కిన్ = కు; గ్రద్దనన్ = శీఘ్రముగా; ఱోలున్ = రోటిని; ఈడ్చుకొనుచున్ = లాగుకొంటూ; కడకన్ = పూని; చనియెన్ = వెళ్ళెను.

<u>భావము</u>:- ఆ టక్కులమారి ముద్దుకృష్ణుడు ఆ రెండు మద్దిచెట్లను కూల్చాలని సంకల్పించాడు. ఏ మాత్రం ఆలస్యం చేయకుండా మద్దిచెట్ల జంట దగ్గరకు అమాతంగా ఱోలు ఈడ్చుకుంటూ వెళ్ళాడు.

10.1-401-వ.

చని యా యూర్జిత మహాబలుండు నిజోదరదామ సమాకృష్యమాణ తిర్యగ్భవదులూఖలుండై యా రెండు మ్రాకుల నడుమం జొచ్చి ముందటికి నిగుడుచు.



<u>టీక</u>:- చని = వెళ్ళి; ఆ = ఆ; ఊర్జిత = దృఢమైన; మహా = గొప్ప; బలుండు = శక్తిశాలి; నిజ = తన యొక్క; ఉదర = పొట్టకి; దామ = కట్టబడి; సమా = చక్కగా; ఆకృష్యమాణ = లాగబడుచున్నట్టి; తిర్యక్ = తిరుగుచున్నది; భవత్ = అగుచున్న; ఉలూఖలుండు = ఱోలు కలవాడు; ఐ = అయ్యి; ఆ = ఆ; రెండు = రెండు (2); మ్రాకుల = చెట్ల; నడుమన్ = మధ్యన; చొచ్చి = దూరి; ముందటి = ముందు; కిన్ = కి; నిగుడుచున్ = నిక్కుచు.

<u>భావము</u>:- దృఢమైన బలము కల ఆ కృష్ణబాలకుడు, తన పొట్టకు కట్టిన త్రాటిని బలంగా ఊపాడు, ఱోలు అడ్డంతిరిగిపోయింది. అతడు చెరచెరా మద్దిచెట్లు రెంటి మధ్యనుండి దూరి ఱోలును ఈడ్చుకుంటూ ముందుకు వెళ్ళిపోయాడు.

10.1-402-క.

బాలుఁడు ఱోలడ్డము దివ
మూలంబులు పెకలి విటపములు విఱిగి మహా
భీలధ్వనిఁ గూలెను శా
పాలస్యవివర్జనములు యమళార్జునముల్

టీక:- బాలుడు = బాలకృష్ణుడు; ఱోలు = ఱోలు; అడ్డమున్ = అడ్డముగా; తివన్ = లాగుటచేత; మూలంబులు = వేళ్లతోసహా; పెకలి = పెల్లగిల్లి; విటపములు = చెట్లు; విఱిగి = విరిగిపోయి; మహా = మిక్కిలి; అభీల = భయంకరమైన; ధ్వనిన్ = శబ్దముతో; కూలెను = పడిపోయెను; శాపా = శాపమువలన కలిగిన; అలస్య = అలసత్వమును; వివర్జనములున్ = తొలగినవి; యమళ = జంట; అర్జునములు = మద్దిచెట్లు.

భావము:- ఆ కృష్ణబాలుడు అడ్డం పడిన ఱోలుని లాగాడు. దాంతో ఆ జంట మద్దిచెట్లు రెండూ వేళ్ళతో సహా పెకలించుంకొనిపోయి, కొమ్మలు విరిగిపోతూ మహాభయంకరమైన ధ్వనితో నేలకూలిపోయాయి. చాలా కాలం తరువాత వాటికి శాపాలు తొలగిపోయాయి.

## గుహ్యకులు కృష్ణుని పొగడుట



10.1-403-వ.

ఇట్లు నిర్మూలంబు లై పడిన సాలంబులలో నుండి కీలికీలలు వెల్వడు పోలిక నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధు లైన సిద్ధు లిద్దఱు వెడలివచ్చి ప్రబుద్ధులై భక్తలోక పాలకుండైన బాలకునకు మ్రొక్కి లేచి కర కమలంబులు మొగిడ్చి యిట్లనిరి.

టీక:- ఇట్లు = ఈ విధముగ; నిర్మూలంబులు = వేళ్లతోసహా పెల్లగిలినవి; ఐ = అయ్యి; పడిన = పడిపోయిన; సాలంబుల = మద్దిచెట్ల; లోన్ = లోపల; నుండి = నుండి; కీలి = అగ్ని; కీలలు = శిఖలు, జ్వాలలు; వెల్వడు = వెలువడెడి; పోలికన్ = వలె; ఎక్కుడు = అధికమైన; తేజంబునన్ = తేజస్సుతో; దిక్కులున్ = అన్నిదిశలు; పిక్కటిల్లన్ = నిండుతుండగా; ప్రసిద్ధులు = కనబడిన వారు; ఐన = అయినట్టి; సిద్ధులు = సిద్ధపురుషులు; ఇద్దఱున్ = ఇద్దరు (2); వెడలి = బయట; వచ్చి = పడి; ప్రబుద్ధులు = మిక్కిలి బుద్ధి కలవారు; ఐ = అయ్యి; భక్త = భక్తులు; లోక = అందరకు; పాలకుండు = కాపాడువాడు; ఐన = అయినట్టి; బాలకున్ = బాలకృష్ణున; కున్ = కి; మ్రొక్కి = వంగి నమస్కరించి; లేచి = లేచి నిలబడి; కర = చేతులు అనెడి; కమలంబులున్ =

పద్మములను; మొగిడ్చి = జోడించి; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- అలా మొదలంటా కూలిన ఆ జంట మద్ది చెట్లలోనుండి, అగ్నిజ్వాలలు వెలువడినట్లు ఇద్దరు యక్షులు నిద్రమేల్కొన్నట్లు లేచి, దిక్కులు నిండిన తేజస్సులతో ప్రత్యక్ష మయ్యారు. భక్తులందరినీ రక్షించే కృష్ణబాలకునికి వికసించిన జ్ఞానంతో తలవంచి నమస్కారాలు చేసారు. చేతులు జోడించి అతనితో ఇలా అన్నారు.

10.1-404-క.

"బాలుఁడవె నీవు? పరుఁడ వ
నాలంబుఁడ వధికయోగి వాద్యుఁడవు తను
స్థూలాకృతి యగు విశ్వము
నీ లీలారూప మండ్రు నిపుణులు కృష్ణా!

టీక:- బాలుడవె = సాధారణ పిల్లాడివా, కాదు; నీవున్ = నీవు; పరుడవు = పరాత్పరుడవు {పరుడు - పరా పశ్యంతి మధ్యమ వైఖరీ అనెడి వాక్కులకు అందనివాడవు}; అనాలంబుడవు = ఆలంబనల కతీతుడవు; అధిక = అధికమైన; యోగివి = వైభవములు కలవాడవు; ఆద్యుడవు = విశ్వ కారణభూతుడవు; తను = సూక్ష్మ; స్థూల = బహుళమైన; ఆకృతి = జగత్తులు కలది; అగు = ఐన; విశ్వము = భువనము; నీ = నీ యొక్క; లీలా = క్రీడా; రూపము = స్వరూపము; అండ్రు = అనెదరు; నిపుణులు = బాగా తెలిసినవారు; కృష్ణా = శ్రీకృష్ణా.

భావము:"శ్రీకృష్ణా! నీవు సామాన్యమానవబాలుడవా? కాదుకాదు. పరబ్రహ్మవు. నీకు నీవే కాని వేరే ఆధారం అక్కరలేనివాడవు. మహాయోగివి. అన్నిటికీమొదటివాడవు. అత్యంత సూక్ష్మంనుండి అత్యంతస్థూలంవరకూ ఈవిశ్వమంతా నీరూపమే అని వివేకులు అంటారు.

10.1-405-సీ.

ఎల్లభూతంబుల కింద్రియాహంకృతి-
    ప్రాణంబులకు నధిపతివి నీవ;
ప్రకృతియుఁ బ్రకృతిసంభవమహత్తును నీవ-
    వీని కన్నిటికిని విభుఁడ వీవ;
ప్రాకృతగుణవికారములఁ బొందక పూర్వ-
    సిద్ధుఁడ వగు నిన్నుఁ జింత జేయ
గుణయుతుం డోపునే? గుణహీన! నీ యంద-
    కల గుణంబుల నీవ కప్పఁబడుదు;

10.1-405.1-తే.

మొదల నెవ్వని యవతారములు శరీరు
లందు సరిదొడ్డు లేని వీర్యముల దనువు
లడర జన్మించి వారల యందుఁ జిక్క;
నట్టి పరమేశ! మ్రొక్కెద మయ్య! నీకు.

టీక:- ఎల్ల = సకల; భూతంబుల = ప్రాణుల, భూమ్యాది {పంచభూతములు – భూమి, నీరు, వాయువు, తేజస్సు, ఆకాశము అనే అయిదు}; కిన్ = కు; ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములు {చతుర్దశేంద్రియములు - ఐదు జ్ఞానేంద్రియములు (కన్ను ముక్కు చెవి నాలుక చర్మము) ఐదు కర్మేంద్రియములు (కాళ్ళు చేతులు నోరు గుహ్యేంద్రియము గుదము) నాలుగు అంతరింద్రియములు (మనస్సు బుద్ధి చిత్తము ఆహంకారము)}; అహంకృతి = అహంకారము; ప్రాణంబుల్ = పంచప్రాణముల {పంచప్రాణములు - 1ప్రాణము 2అపానము 3సమానము 4ఉదానము 5వ్యానము}; కున్ = కు; అధిపతివి = ప్రభువువి; నీవ = నీవుమాత్రమే; ప్రకృతియు = అవ్యక్తము, మాయ; ప్రకృతి = ప్రకృతివలన; సంభవ = పుట్టిన; మహత్తును = మహత్తు; నీవ = నీవె; వీటి = వీని; కిన్ = కి; అన్నిటికిని = అన్నింటికి; విభుడవు = అధిపతివి; ఈవ = నీవె; ప్రాకృత = ప్రకృతిసంబంధమైన; గుణ = త్రిగుణములను {త్రిగుణముల - శాంత ఘోర మూఢవృత్తులు గల సత్త్వరస్తమోగుణములు}; వికారములన్ = షడ్వికారములను {షడ్వికారములు - 1పుట్టుట 2పెరుగుట 3ముదియుట 4ఫలించుట 5చిక్కుట 6చచ్చుట}; పొందక = చెందకుండగ; పూర్వ = ఈ సృష్టికి పూర్వమే; సిద్ధుడవు = స్వప్రాకాశము కలవాడవు; నిన్నున్ = నిన్ను; చింతచేయ = భావింప; గుణయుతుండు = త్రిగుణములతో కూడినవాడు; ఓపునే = శక్తి కలవా డగునే, కాడు; గుణహీన = త్రిగుణాతీత; నీ = నీ; అందన్ = లోపలనే; కల = ఉన్నట్టి; గుణంబులన్ = త్రిగుణములచేత; నీవ = నీవే; కప్పబడుదువు = మరుగునపడెదవు. మొదలన్ = ఆది అందు; ఎవ్వని = ఎవని యొక్క; అవతారములు = అవతారములు; శరీరులు = ప్రాణుల; అందున్ = అందు; సరిదొడ్డులోని = సాటిలేని; వీర్యముల = పరాక్రమములు; తనువులున్ = దేహములు; అడరన్ = వర్ధిల్లుచుండగా; జన్మించి = పుట్టి; వారి = ఆదేహ ధారుల; అందున్ = ఎడల; చిక్కవు = తగుల్కొనవు; అట్టి = అటువంటి; పరమేశ = సర్వోత్కృష్టభగవంతుడా; మ్రొక్కెదము =నమస్కరించెదము; అయ్య =తండ్రి; నీ = నీ; కున్ = కు.

భావము:- సకల జీవరాశులకు, పంచభూతములు, చతుర్దశదశ ఇంద్రియములు, అహంకారము, పంచప్రాణములు సమస్తమునకు అధిపతివి; ప్రకృతీ నీవే, దానినుండి పుట్టిన మహత్తూ నీవే; అయినా వీటికి వేటికినీ అందకుండా అన్నిటిపైన ఉండే అధిపతివి నీవే; ప్రకృతి గుణాలు, నీలో ఏమార్పును కలిగించలేవు. నీలోంచే అవి పుట్టుకు వస్తాయి. సృష్టికి పూర్వంనుండి స్వయం ప్రకాశము కలవాడవు. ఇక గుణాలలో ఆవరింపబడినవాడు నిన్ను గూర్చి ఎలా ధ్యానం చేయగలడు? నీకు ఏ గుణాలూ లేవు; నీ నుండి గుణాలు

వస్తూ ఉంటాయి; వాటిచేత కప్పబడి రహస్యంగా దాగి ఉంటావు; శరీరం ధరించిన వీరెవ్వరూ నీ అవతార వైభవాలకి సాటిరారు; నీ రూపాలు వేరు, వీళ్ళరూపాలు వేరు; ఈ జీవులంతా నీ తేజస్సుతో శరీరాలు ధరించి పుడతారు; కనుక వీళ్ళకి అంతుపట్టవు. అటువంటి పరమపురుష! నీకు నమస్కారం చేస్తున్నాము.

10.1-406-క.

భు**వ**నములు చేయఁ గావఁగ

<u>న</u>**వ**తీర్ణుఁడ వైతి కాదె <u>య</u>ఖిలేశ్వర! యో

గి**వ**రేణ్య! విశ్వమంగళ!

<u>క</u>**వి**సన్నుత! వాసుదేవ! <u>క</u>ల్యాణనిధీ!

<u>టీక</u>:- భువనములు = లోకములను; చేయగన్ = సృష్టించుటకు; కావగన్ = కాపాడుటకు; అవతీర్ణుడవు = అవతరించుచుండవాడవు; ఐతి = అయినావు; కాదె = కదా; అఖిలేశ్వర = సర్వేశ్వరుడా {అఖిలేశ్వరుడు - అఖిల – పంచకృత్యము లన్నిటిని (1సృష్టి 2స్థితి 3లయ 4తిరోధాన 5అనుగ్రహ) చేయుటకు ఈశ్వరుడు (కర్త)}; యోగి = యోగులచే; వరేణ్య = వరింపబడెడివాడా; విశ్వ = భువనములకు; మంగళ = శుభప్రదుడా; కవి = కవులచే, సృష్టికర్తలచే; సన్నుతా = కీర్తింపబడెడివాడా; వాసుదేవ = శ్రీకృష్ణా {వాసుదేవుడు - లోకములన్ని తన యందు తను లోకము లన్నిటి యందు వసించు వాడు, విష్ణువు}; కల్యాణ = శోభనములకు; నిధీ = నిధి వంటివాడా.

<u>భావము</u>:- ఓ వాసుదేవా! శ్రీకృష్ణా! ఈ లోకాలను అన్నింటినీ సృష్టించడానికీ, రక్షించడానికీ అవతరించావు గదా! నీవు ఈ సమస్తానికి ఈశ్వరుడవు. యోగులు అందరూ నిన్ను దైవంగా వరించారు. నీవు ఈ సృష్టికి శుభాలు చేకూర్చుతావు. సృష్టిలోని శుభాలు అన్నీ నీ నుండే పుడుతూ ఉన్నాయి.

10.1-407-ఉపేం.

<u>త</u>**ప**స్వివాక్యంబులు <u>ద</u>ప్ప వయ్యెన్;

<u>నె</u>**పం**బునం గంటిమి <u>ని</u>న్నుఁ జూడన్

<u>ద</u>**పం**బు లొప్పెన్; మముఁ <u>దా</u>వకీయ

<u>ప్ర</u>**ప**న్నులం జేయుము <u>భ</u>క్తమిత్రా!

<u>టీక</u>:- తపస్వి = ఋషి యొక్క; వాక్యంబులు = మాటలు; తప్పవు = వట్టిపోనివి; అయ్యెన్ = అయినవి; నెపంబునన్ = వంక వలన (నారదశాపం); కంటిమి = చూడగలిగితిమి; నిన్నున్ = నిన్ను; చూడన్ = చూచుటతోడనే; తపంబులు = మా తపస్సులు; ఒప్పెన్ = సాఫల్యము లాయెను; మమున్ = మమ్ములను; తావకీయ = నీకు; ప్రపన్నులన్ = శరణాగతులనుగా; చేయుము = చేయుము; భక్తమిత్ర = శ్రీకృష్ణ {భక్తమిత్రుడు - భక్తులకు ఆప్తుడు, విష్ణువు}.

<u>భావము</u>:- ఓ కృష్ణపరమాత్మా! నారదమునీంద్రుల వారు మహాతపస్వి. వారి మాటలు వట్టిపోకుండా అలాగే జరిగింది. వారి శాపం పుణ్యమా అని నిన్ను చూడగలిగాము. ఇన్నేళ్ళ నుండీ నిన్ను చూడాలనే తపించాము. ఇప్పటికి ఫలించింది. నీవు భక్తులకు పరమ మిత్రుడవు. మమ్మలను నీ శరణాగత భక్తులుగా మన్నించి అనుగ్రహించు.
గమనిక- ఈ ఉపేంద్రవజ్రము చందస్సుతో మొత్తం గ్రంథంలో ఇదొక్కటే పద్యం
*10.1-408-శా.

<u>నీ</u> పద్యావళు లాలకించు చెవులున్ <u>ని</u>న్నాడు వాక్యంబులున్
<u>నీ</u> పేరం బనిచేయు హస్తయుగముల్ <u>నీ</u> మూర్తిపైఁ జూపులున్
<u>నీ</u> పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ <u>నీ</u> సేవపైఁ జిత్తముల్
<u>నీ</u> పై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ <u>నీ</u>రేజపత్రేక్షణా!"

<u>టీక</u>:- నీ = నీ యొక్క; పద్య = పద్యముల; ఆవళుల్ = సమూహములను; ఆలకించు = వినెడి; చెవులున్ = చెవులూ; నిన్నున్ = నిన్ను; ఆడు = స్తుతించెడి; వాక్యంబులున్ = మాటలూ; నీ = నీకు; పేరన్ = సమర్పణగా; పనిచేయు = పనిచేసెడి; హస్త = చేతుల; యుగముల్ = జంటలూ; నీ = నీ యొక్క; మూర్తి = స్వరూపము; పైన్ = మీది; చూపులున్ = దృష్టులూ; నీ = నీ యొక్క; పాదంబులన్ = పాదముల; పొంతన్ = దగ్గర; మ్రొక్కు = వాలి నమస్కరించెడి; శిరముల్ = తలలూ; నీ = నీ; సేవ = సేవచేయుట; పైన్ = అందే; చిత్తముల్ = మనసులూ; నీ = నీ; పైన్ = మీది; బుద్ధులు = బుద్ధులూ; మా = మా; కున్ = కు; ఇమ్ము = ఇమ్ము; కరుణన్ = దయతో; నీరేజపత్రేక్షణా = శ్రీకృష్ణా {నీరేజపత్రేక్షణుడు - తామర రేకుల వంటి కన్నులు కలవాడు, విష్ణువు}.

<u>భావము</u>:- ఓ కమలపత్రాల వంటి కన్నులున్న కన్నయ్యా! నీ స్తుతి చేసే పద్యాలను విడువక వింటూ ఉండే చెవులను, నిన్ను విడువక స్తోత్రం చేస్తు ఉండే వాక్కులను మాకు అనుగ్రహించు. ఏ పని చేస్తున్నా నీ పేరనే నీ పనిగానే చేసే చేతలను, ఎప్పుడు విడువక నిన్నే చూసే చూపులను మాకు అనుగ్రహించు. నీ పాదపద్మాలను విడువక నమస్కరించే శిరస్సులను, నీమీద ఏకాగ్రమైన భక్తి కలిగి ఉండే మనస్సును, నిరంతరం నీ ధ్యానం పైనే నిలిచి ఉండే బుద్ధిని మాకు దయతో ప్రసాదించు, పరమేశ్వరా!
బాలకృష్ణుడు తన నడుముకు కట్టిన ఱోలు ఈడ్చుకుంటూ రెండు మద్దిచెట్లను కూల్చాడు. వాటినుండి విముక్తులైన గుహ్యకులు కపటబాలుని స్తుతించి మాకు నీ యందు ప్రపత్తిని అనుగ్రహించమని ఇలా వేడుకున్నారు. ఇది భాగవతుల ధర్మాలని నిర్వచించే ఒక పరమాద్భుతమైన పద్యం. అందుకే ఒక శార్దూలాన్ని వదలి, ప్రాసాక్షార నియమాన్ని యతి స్థానాలైన మొదటి, పదమూడవ స్థానాలకు కూడా ప్రసరింపజేసి పంచదార పలుకులకు ప్రత్యేక జిలుగులు అద్దారు పోతనామాత్యులు.

10.1-409-వ.

అని యిట్లు కీర్తించిన గుహ్యకులం జూచి నగుచు నులూఖల బద్ధుండైన హరి యిట్లనియె.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; కీర్తించిన = స్తుతించిన; గుహ్యకులన్ = గుహ్యకులను (దేవజాతి); చూచి = కనుగొని; నగుచున్ = నవ్వుతు; ఉలూఖల = రోటికి; బద్ధుండు = కట్టబడినవాడు; ఐన = అయినట్టి; హరి = శ్రీకృష్ణుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా స్తుతిస్తున్న యక్షులు నలకూబర, మణిగ్రీవులతో రోటికి కట్టబడి ఉన్న కృష్ణమూర్తి చిరునవ్వులు నవ్వుతూ ఇలా అన్నాడు.

10.1-410-క.

"తమతమ ధర్మముఁ దప్పక
సముులై నను నమ్మి తిరుగు సభ్యులకును బం
ధము ననుఁ జూచిన విరియును
గమలాప్తుఁడు పొడమ విరియు ఘనతమము క్రియన్.

టీక:- తమతమ = స్వ, వారివారి; ధర్మమున్ = ధర్మమును; తప్పకన్ = విడువకుండగ; సములు =సహృదయులు, సుజనులు; ఐ = అయ్యి; ననున్ = నన్ను; నమ్మి = విశ్వసించి; తిరుగు = మెలగెడి; సభ్యుల్ = మంచివారల; కును = కు; బంధము = సాంసారిక బంధము; ననున్ = నన్ను; చూచిన = దర్శించిన మాత్రముచే; విరియునున్ = విడిపోవును; కమలాప్తుడు = సూర్యుడు {కమలాప్తుడు - కమలములకు మిత్రుడు, సూర్యుడు}; పొడమన్ = ఉదయించుట తోనే; విరియు = తొలగిపోయెడి; ఘన = గాఢమైన; తమము = చీకటి; క్రియన్ = వలె.

భావము:- “తమతమ ధర్మాలను తప్పకుండా అందరి ఎడల సమత్వంతో ప్రవర్తిస్తూ, నన్ను నమ్మి మెలగుతుండే వారు సజ్జనులు. సూర్యుడు ఉదయించటంతోనే దట్టమైన చీకట్లు తొలగినట్లు; అలాంటివారికి నన్ను చూడగానే బంధాలు విడిపోయి, మోక్షం లభిస్తుంది.

10.1-411-క.

కారుణ్యమానసుం డగు
నారదువచనమునఁ జేసి ననుఁ బొడఁగనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి
చేరెన్ నామీఁది తలఁపు సిద్ధము మీకున్."

టీక:- కారుణ్య = దయా; మానసుండు = హృదయుడు; అగు = ఐన; నారదు = నారదుని యొక్క {నారదుడు - నరస్యేదంనారం నారంవిజ్ఞానానందదాతీతి నారదః అని వ్యుత్పత్తి,

అవినాశమైనదానికి (ఆత్మ) చెందినది నారం (బ్రహ్మ) అట్టి బ్రహ్మజ్ఞానమును కలుగజేయువాడు నారదుడు అనబడును, బ్రహ్మవేత్త}; వచనమునన్ = మాట; చేసి = వలన; ననున్ = నన్ను; పొడగనుటన్ = దర్శించుటచేత; మీరున్ = మీరు; ప్రబుద్ధులు = మేలైన జ్ఞానము కలవారు; ఐతిరి = అయినారు; చేరెన్ = సమకూడెను; నా = నా; మీది = పైని; తలపు = ధ్యాస; సిద్ధము = తథ్యము, నిజముగ; మీ = మీ; కున్ = కు.

<u>భావము</u>:- నారదమహర్షి దయాస్వభావి. వారు ఇచ్చిన శాపం కారణంగా మీరు నన్ను చూడగలిగారు. మీరు సుజ్ఞానులు అయ్యారు. ఈనాటి నుండీ మీకు నామీద భక్తి చేకూరుతుంది.”

## 10.1-412-వ.

అని యీశ్వరుండు మీరు “మీ నెలవులకుం బొం” డని యానతిచ్చిన, మహాప్రసాదంబని వలగొని పెక్కు మ్రొక్కులిడి, నలకూబర మణిగ్రీవు లుత్తర భాగంబున కరిగి రంత; నందాదు లైన గోపాలకులు నిర్మూలంబులై పడిన సాలంబుల చప్పుడు పిడుగు చప్పు డని శంకించి వచ్చి చూచి.

<u>టీక</u>:- అని = అని; ఈశ్వరుండు = శ్రీకృష్ణుడు {ఈశ్వరుడు - పంచకృత్యములను (1సృష్టి 2స్థితి 3లయ 4తిరోధాన 5అనుగ్రహములు) చేయుటకు కర్తృత్వము కలవాడు, విష్ణువు}; మీరున్ = మీరు; మీ = మీ యొక్క; నెలవులు = నిజస్థానముల; కున్ = కు; పొండు = వెళ్ళండి; అని = అని; ఆనతి = విడ్కోలు; ఇచ్చినన్ = చెప్పగా; మహా = గొప్ప; ప్రసాదంబు = అనుగ్రహము; అని = అని; వలగొని = ప్రదక్షిణముచేసి; పెక్కు = అనేకమైన; మ్రొక్కులు = నమస్కారములు; ఇడి = చేసి; నలకూబర = నలకూబరుడు; మణిగ్రీవులు = మణిగ్రీవులు; ఉత్తరభాగంబున్ = ఉత్తరపు దిక్కున; కున = కు; అరిగిరి = వెళ్ళిపోయిరి; అంతన్ = అప్పుడు; నంద = నందుడు; ఆదులైన = మొదలైన; గోపాలకులు = యాదవులు; నిర్మూలంబులు = వేళ్ళతోసహా పెళ్ళగిలినవి; ఐ = అయ్యి; పడిన = పడిపోయిన; సాలంబులన్ = మద్దిచెట్ల యొక్క; చప్పుడును = శబ్దమును; పిడుగు = పిడుగుపడిన; చప్పుడు = చప్పుడు; అని = అని; శంకించి = అనుమానించి; వచ్చి = అక్కడకు వచ్చి; చూచి = చూసి.

<u>భావము</u>:- ఇలా చెప్పి, “ఇక మీరు మీ లోకాలకు పోవచ్చును” అని కృష్ణుడు అనుజ్ఞ ఇచ్చాడు. యక్షులు “మహాప్రసాదం” అంటూ ప్రదక్షిణలు చేసి, అనేక విధాలుగా మ్రొక్కి, సెలవు తీసుకొని ఉత్తర దిక్కుగా వెళ్ళిపోయారు. ఇంతలో నందుడు మొదలైన గోపకులు చప్పుడు విని, పిడుగు పడిందేమో అని భయపడి వచ్చి కృష్ణబాలునీ, పడిన మద్దిచెట్లనూ చూసారు.

10.1-413-క.

"ఈ పాదపములు గూలఁగ

నీ పాపఁ డులూఖలమున నిటు బద్ధుండై

యే పగిది బ్రతికెఁ? గంటిరె;

వాపోవఁడు; వెఱవఁ; డెట్టివాఁడో యితఁడున్.

టీక:- ఈ = ఇంతటి; పాదపములున్ = వృక్షములు {పాదపము - వేళ్ళతో నీరుతాగునది, చెట్టు}; కూలగన్ = పడిపోగా; ఈ = ఈ; పాపడు = చిన్నపిల్లవాడు; ఉలూఖలమునన్ = రోటికి; ఇటు = ఇలా; బద్ధుండు = బంధింపబడినవాడు; ఐ = అయ్యి; ఏ = ఏ; పగిదిని = విధముగా; బ్రతికెన్ = జీవించి ఉన్నాడు; కంటిరె = చూసారా (ఈవింత); వాపోవడు = ఏడువడు; వెఱవడు = బెదరడు; ఎట్టివాడో = ఎంత ధైర్యవంతుడో; ఇతడున్ = ఇతను.

భావము:- "అయ్యో! ఇంత పెద్ద చెట్లు ఇలా కూలిపోతే, ఇలా రోటికి కట్టివేయబడి ఉన్న ఈ చంటిపిల్లాడు ఎలా బ్రతికి ఉన్నాడో? చూశారా! ఏడవనూ లేదు, భయపడనూ లేదు. ఏం పిల్లాడురా బాబూ వీడు?

*10.1-414-తే.

పిడుగు పడదు; గాక పెనుగాలి విసరదు;

ఖండితంబు లగుట గానరాదు;

బాలుఁ డితఁడు; పట్టి పడఁ ద్రోయఁజాలఁడు;

తరువు లేల గూలె ధరణిమీఁద"

టీక:- పిడుగు = పిడుగేమీ; పడదు = పడలేదు; కాక = అదికాకుండ; పెనుగాలి = గట్టిగాలి; విసరదు = వేయలేదు; ఖండితంబులు = నరకబడినవి; అగుటన్ = అగుటకూడ; కానరాదు = కనబడదు; బాలుడు = చిన్నపిల్లవాడు; ఇతడున్ = ఇతను; పట్టి = పట్టుకొని; పడద్రోయన్ = పడునట్లు తోయుటకు; చాలడు = సరిపడడు; తరువులు = వృక్షములు; ఏలన్ = ఎందుచేత; కూలెన్ = పడిపోయినవి; ధరణి = నేల; మీదన్ = మీద.

భావము:- అసలు ఈ మహా వృక్షాలు ఎలా పడిపోయాయి? పిడుగు పడింది లేదు. పోనీ పెద్దగాలి వీచిందా అంటే అదిలేదు. ఎవరు నరికిన సూచనలు ఏమి లేవు. కూకటి వేళ్ళతో సహా కూలిపోయాయి. ఈ పిల్లాడు ఏమైనా పడగొట్టాడు అనుకుందా మంటే మరీ ఇంత పసిపిల్లాడు అంత పెద్ద చెట్లను పడ తొయ్యటం అసాధ్యం కదా! మరి అయితే ఈ చెట్లు ఎలా కూలిపోయినట్లు?"

10.1-415-వ.

అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయు నని శంకింప నక్కడ నున్న బాలకు లిట్లనిరి.

టీక:- అని = అని; పెక్కండ్రు = అనేకులు; పెక్కు = అనేక; విధంబులన్ = విధములుగా; ఉత్పాతంబులు =అపశకునము, ఉపద్రవము, అశుభ సూచక మగు భూత వికారము; కావలయును = అయ్యుండవచ్చును; అని = అని; శంకింపన్ = సందేహించుచుండగా; అక్కడన్ = ఆ సమీపమున; ఉన్న = ఉన్నట్టి; బాలకులు = పిల్లలు; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- అలా పదిమందీ పదిరకాలుగా అపశకునమేమో అనుకుంటూ ఉండగా, అక్కడ ఆడుకుంటున్న గోపకుల అబ్బాయిలు ఇలా అన్నారు.

10.1-416-క.

"నం**దు**ని కొమరుఁడు వినుఁ డీ
సం**దు**న మును దూఱి ఱోలు సరి యడ్డముగా
ముం**ద**టి కీడ్చిన మద్దులు
గ్రం**దు**కొనం గూలె; జనులఁ గంటి మిరువురన్."

టీక:- నందుని = నందుడి యొక్క; కొమరుడ = పుత్రుడు; వినుడు = వినండి; ఈ = ఇక్కడి; సందునన్ = నడిమి ఇరుకు మార్గము; మునున్ = ముందుగా; దూఱి = దూరి వెళ్ళి; ఱోలున్ = ఱోలు; సరియడ్డము = బాగ అడ్డము; కాన్ = పడగా; ముందఱ = ఎదర; కిన్ = కు; ఈడ్చినన్ = లాగగా; మద్దులు = మద్దిచెట్లు; క్రందుకొనన్ = పెద్ద చప్పుడు చేస్తూ; కూలెన్ = పడిపోయెను; జనులన్ = వ్యక్తులను; కంటిమి = చూసితిమి; ఇరువురన్ = ఇద్దరను (2).

భావము:- "నందుని కొడుకు అయినట్టి కృష్ణుడు ఈ చెట్ల సందులలోనుంచి ముందు తాను దూరాడు. వెనుక నున్న ఱోలు ఏమో అడ్డంతిరిగింది. గట్టిగా లాగాడు. అంతే! మద్ది చెట్లు ఫెళఫెళ మంటూ కూలిపోయాయి. ఇద్దరు వ్యక్తులు కనబడ్డారు."

10.1-417-వ.

అని యిట్లు పలికిన బాలకాలాపంబులు విని మిథ్యారూపంబు లని కొందఱనిరి; కొందఱు నానావిధంబుల సందేహించి; రంత నందుండు వికసిత వదనారవిందుం డగుచుఁ బట్టి కట్లు విడిచెను; నట్టి యెడఁ దన తెఱం గెవ్వరు నెఱుంగకుండవలె నని తవరకుమారుండు.

<u>టీక</u>:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; పలికిన = చెప్పిన; బాలక = చిన్నపిల్లల; ఆలాపంబులు = పలుకులు; విని = విని; మిథ్యా = అసత్యపు, భ్రాంతి; రూపంబులు = స్వరూపములు; అని = అని; కొందఱు = కొంతమంది; అనిరి = పలికిరి; కొందఱు = కొంతమంది; నానావిధంబులన్ = రకరకములుగా; సందేహించిరి = అనుమానపడిరి; అంతన్ = అప్పుడు; నందుండు = నందుడు; వికసిత = విప్పారిన; వదన = మోము అనెడి; అరవిందుడు = పద్మము కలవాడు; అగుచున్ = ఔతూ; పట్టి = పిల్లవాని; కట్లు = బంధనములు; విడిచెను = విప్పివేసెను; అట్టి = ఆ; ఎడన్ = సమయము నందు; తన = అతని యొక్క; తెఱంగు = విధమును; ఎవ్వరున్ = ఎవరుకూడ; ఎఱుంగకుండవలెను = తెలియకూడదు; అని = అని; ఠవర = మాయా, నేర్పరియైన; కుమారుండు = బాలకుడు.

<u>భావము</u>:- ఇట్లా యాదవ బాలురు చెప్పగా, కొందరు అబద్ధాలాడుతున్నారు అన్నారు. మరి కొందరు మరికొన్ని విధాలుగా సందేహించారు. అప్పుడు నందుడు తన కుమారుడు బ్రతికి బయటపడి నందుకు సంతోషించాడు. అతడు ముందుకు వచ్చి కృష్ణునికి కట్టిన త్రాళ్ళు విప్పాడు. ఆ సమయంలో ఈ విషయం నుండి గోపకుల మనస్సులు మళ్ళించటానికి, లీలా వినోది, కపట మానవ బాలకుడు అయిన కృష్ణుడు.

10.1-418-శా.

<u>పా</u>**డున్** మందుని భంగి; గోపవనితల్ <u>పా</u>ణిధ్వనుల్ సేయఁగా
<u>నా</u>**డున్** జంత్రముకైవడిం; బరవశుండై హస్తముల్ త్రిప్పుచుం;
<u>జూ</u>**డన్** నేరని వాని భంగి జనులం <u>జూ</u>చున్; నగున్; బాలురం
<u>గూ</u>**డున్** బెద్దలపంపు చేయఁజను; డా<u>గున్;</u> మట్టిఁ జిట్టాడుచున్.

<u>టీక</u>:- పాడున్ = గీతములు పాడును; మందుని = మూఢుని; భంగిన్ = విధముగ; గోపవనితలు = గోపికలు; పాణిధ్వనుల్ = చప్పట్లు; చేయగాన్ = కొడుతుండగా; ఆడున్ = నాట్యము చేయును; జంత్రము = కీలుబొమ్మ; కైవడిన్ = వలె; పరవశుండు = మిక్కిలి ఆనందించువాడు; ఐ = అయ్యి; హస్తముల్ = చేతులు; త్రిప్పుచున్ = ఆడించుచు; చూడన్ = చూడడానికి; నేరనివాని = అభం శుభం తెలియని వాని; భంగిన్ = వలె; జనులన్ = ప్రజలను; చూచున్ = చూచును; నగున్ = నవ్వును; బాలురన్ = పిల్లలతో; కూడున్ = కలియును; పెద్దల = పెద్దవారి; పంపున్ = చెప్పినపనిని; చేయన్ = చేయుటకు; చనున్ = వెళ్ళును; డాగున్ = మరుగున దాగును; మట్టిన్ = మట్టిలో; చిట్టాడుడుచున్ = చిమ్ముకొనుచు, తప్పటడుగులు వేస్తూ, క్రీడిస్తూ.

<u>భావము</u>:- అమాయకపు పిల్లాడిలా పాటలు పాడుతాడు, గోపికాస్త్రీలు చేతులతో లయబద్ధంగా చప్పట్లు చరుస్తూ ఉంటే, పరవశుడై కీలుబొమ్మలా చేతులు తిప్పుతూ నాట్యాలు చేస్తాడు. చూడటం తెలియవానిలా జనుల వంక పలకరింపుగా చూస్తాడు.

నవ్వుతాడు, తోటి పిల్లలతో కలిసి గంతులు వేస్తాడు. పెద్దవారు ఏమైనా చెప్తే బుద్ధిమంతునిలా చేస్తాడు. తలుపుచాటున దాక్కుంటాడు. మట్టిలో ఆడతాడు. నందాదుల మనసులు మళ్ళించటానికి ఇలా ప్రవర్తించాడు చిన్నికన్నయ్య.

## కపటబాల లీలలు

*10.1-419-క.

"చుంచొదువుఁ బాలు ద్రావు ము

దంచితముగ" ననుఁడుఁ బాలు ద్రావి జననితోఁ

జుం చొదువ దనుచు లీలా

చుంచుం డై యతఁడు చుంచుఁ జూపె నరేంద్రా!

టీక:- చుంచు = పిలక, బలము, నేర్పరితనం {నేర్పరి- చుంచుప్ ప్రత్యయం ("తేనవిత్తః చుంచుప్ చణపౌ"అని కౌముదీ సూత్రం)}; ఒదవున్ = బాగగును, కలుగును; పాలున్ = పాలను; త్రావుము = తాగుము; ఉదంచితముగన్ = చక్కగా; అనుడున్ = అని చెప్పగా; పాలున్ = పాలను; త్రావి = తాగి; జనని = తల్లి; తోన్ = తోటి; చుంచు = జుట్టు; ఒదవదు = పెరగలేదు; అనుచు = అంటూ; లీలాచుంచుండు = లీలలందు ఆసక్తి కలవాడు; ఐ = అయ్యి; అతడు = అతను; చుంచున్ = పిలకను; చూపెన్ = చూపించెను; నరేంద్రా = రాజా.

భావము:- ఓ రాజా పరీక్షిత్తు! "చక్కగా పాలు తాగు జట్టు బాగా పెరుగుతుం" దని చెప్పి పాలు తాగించింది తల్లి యశోదాదేవి. పాలు తాగి చేతితో జుట్టు తడువుకుంటు "జుట్టు పెరగలేదేం టమ్మా" యని అడిగాడు లీలలు చూపుటందు ఆసక్తిగల ఆ బాలకృష్ణమూర్తి.

10.1-420-క.

సెలగోల పట్టుకొని జల

కలశములో నీడఁ జూచి "కలశయుతుండై

సెలగోలఁ బాపఁ డొకఁ డిదె

తలచెన్ ననుఁ గొట్ట" ననుచుఁ దల్లికి జెప్పెన్.

టీక:- సెలగోల = చెర్నాకోల, కొరడాకఱ్ఱ; పట్టుకొని = చేతబట్టి; జల = నీటి; కలశము = బాన; లోన్ = అందు; నీడన్ = ప్రతిబింబమును; చూచి = చూసి; కలశ = కుండలో; యుతుడు = ఉన్నవాడు; ఐ = అయ్యి; సెలగోలన్ = కొరడాకఱ్ఱతో; పాపడు = చిన్నపిల్లవాడు; ఒకడు = ఒకానొకడు; ఇదె = ఇదిగో; తలచెన్ = అనుకుంటున్నాడు; ననున్ = నన్ను; కొట్టన్ = కొట్టాలి;

అనుచున్ = అనుచు; తల్లి = తల్లి; కిన్ = కి; చెప్పెన్ = చెప్పెను.

<u>భావము</u>:- చిన్నికన్నయ్య ఒకరోజు సెలగోల చేతిలో పట్టుకొని, గిన్నెలోని నీళ్ళలోకి చూసాడు. తన ప్రతిబింబం కనబడింది. ఆ గిన్నె పట్టుకొని తల్లి దగ్గరకు వెళ్ళి “అమ్మా! ఇదిగో చూడు! ఒక పిల్లాడు సెలగోల పట్టుకొని నన్ను కొట్టటానికి వస్తున్నాడు” అన్నాడు.

10.1-421-క.

"భిక్షులు వచ్చెద రేడ్చిన;
<u>భి</u>క్షాపాత్రమున <u>వై</u>చి <u>బె</u>గడించి నినున్
శిక్షించెద"; రని చెప్పిన
<u>భి</u>క్షులఁ గని, తల్లిఁ గనియు <u>భీ</u>తిల్లు నృపా!

<u>టీక</u>:- భిక్షులు = యాచకులు, అడుక్కొనెడివారు; వచ్చెదరు = వస్తారు; ఏడ్చినన్ = ఏడ్చినచో; భిక్షాపాత్రమునన్ = భిక్షాపాత్ర యందు; వైచి = వేసుకొని; బెగడించి = బెదిరించి, జడిపించి; నినున్ = నిన్ను; శిక్షించెదరు = దండింతురు; అని = అని; చెప్పినన్ = చెప్పినచో; భిక్షులన్ = బిచ్చగాళ్ళను; కని = చూసి; తల్లిన్ = తల్లిని; కనియున్ = కనుగొనినను; భీతిల్లె = భయపడెను; నృపా = రాజా.

<u>భావము</u>:- ఓ మహారాజా! యశోదాదేవి “ఏడవకురా కన్నా! ఇదిగో బిచ్చగాళ్లు వస్తున్నారు. ఏడుస్తుంటే వాళ్ళు నిన్ను జోలెలో వేసుకొని తీసుకు వెళ్ళి కొడతారు జాగ్రత్త” అని బెదిరించింది. చిన్నికిట్టయ్య వాకిట్లోకి వచ్చిన బిచ్చగాళ్లను చూసి, తల్లి వైపు భయపడుతూ చూసాడు.

10.1-422-వ.

ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప, బృహద్వనంబున నందాదు లైన గోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు, వానివలన బాలుం డుత్తరించుటయుఁ జూచి యేకాంతంబున నొక్కనాడు విచారింప నుపనందుం డను వృద్ధగోపకుండు తన యెఱుక మెఱసి యిట్లనియె.

<u>టీక</u>:- ఇట్లు = ఈ విధముగ; కృష్ణుండు = బాలకృష్ణుడు; బహు = అనేక; విధంబులన్ = రకములుగా; కపట = మాయా; బాల = బాలుని; లీలలన్ = క్రీడలతో; వినోదింపన్ = వేడుకలు కలుగ చేయగా; బృహద్వనంబునన్ = బృహద్వనమను వ్రేపల్లెలో; నంద = నందుడు; ఆదులైన = మొదలైన; గోప = యాదవ; వృద్ధులు = పెద్దలు; మహా = గొప్ప; ఉత్పాతంబులు = అనుకోని కీడులు, ఉపద్రవములు; కలుగుటయున్ = సంభవించుట; వాని = వాటి; వలనన్ = నుండి; బాలుడు = బాలకృష్ణుడు; ఉత్తరించుటయున్ = దాటుట, బైటపడుట; చూచి = కనుగొని; ఏకాంతంబునన్ = రహస్యముగ; ఒక్క = ఒకానొక; నాడున్ = దినమున; విచారింపన్ =

చర్చించుచుండగా; ఉపనందుండు = ఉపనందుడు; అను = అనెడి; వృద్ధ = పెద్దవయసు; గోపకుండు = గొల్లవాడు; తన = తన యొక్క; ఎఱుక = తెలివి; మెఱసి = చూపి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా చిన్ని కృష్ణుడు కపటబాలలీలలు చూపుతూ క్రీడిస్తూ గోపికలను, గోపాలురను, అందరిని వినోదింపజేస్తున్నాడు. ఒకరోజు నందుడూ, ఇతర గోపాలక పెద్దలూ వ్రేపల్లె దగ్గరి పెద్ద తోటలో సమావేశం అయ్యారు. అప్పటివరకు జరిగిన భయంకరమైన ఉత్పాతాలూ, వాటినుంచి కృష్ణుడు తప్పించుకోటం మున్నగు విషయాలు చర్చించారు. వారిలో ఉపనందుడు అనే వృద్ధగోపాలుడు బుద్ధిలో దైవసంకల్పం వలన ఒక ఆలోచన మెరిసింది, అతడు ఇలా అన్నాడు.

## బృందావనము బోవతలచుట

10.1-423-ఉ.

"ఇక్కడ నుందురే మనుజు? లీ మన కృష్ణున కెగ్గు చేయఁగా
రక్కసురాలు చన్నొసఁగె; ఱాలపయిన్ సుడిగాలి వీచెఁ; బై
గ్రిక్కిఱియం దరుల్ వడియెఁ; గేశవు సత్కృపఁ దప్పెఁ; జాలు నేఁ
డెక్కడి కైనఁ బోవలయు నింకిట గోపకులార! వింటిరే?

టీక:- ఇక్కడన్ = ఇలాంటిచోట; ఉందురే = ఉంటారా; మనుజులు = మానవులు ఎవరైనా; ఈ = ఈ; మన = మన యొక్క; కృష్ణున్ = బాలకృష్ణుని; కిన్ = కి; ఎగ్గు = కీడు; చేయగాన్ = చేయుటకు; రక్కసురాలు = రాక్షసి; చన్ను = చనుబాలు; ఒసగెన్ = ఇచ్చెను; ఱాల = బండరాళ్ళ; పయిన్ = మీద; సుడిగాలి = సుడిగాలి; వీచెన్ = వీచినది; పైన్ = అంతేకాక; కిక్కిరియన్ = మిక్కిలి దగ్గరగా, ఇరుకుగా; తరుల్ = చెట్లు; పడియెన్ = పడిపోయినవి; కేశవున్ = నారాయణుని; సత్కృపన్ = మిక్కిలి దయ వలన, చక్కటి కరుణ వలన; తప్పెన్ = తప్పినవి; చాలున్ = చాలును ఇంక; నేడు = ఇప్పుడు; ఎక్కడ = మరింకొక ప్రాంతమున; కిన్ = కు; పోవలయున్ = వెళ్ళిపోవాలి; ఇంకన్ = ఇంక; ఇట = ఇక్కడనుంచి; గోపకులార = గొల్లలలారా; వింటిరే = విన్నారా (నా మాట).

భావము:- “మనుష్యులు ఉండే ప్రదేశమా ఇది. మన ఈ చిన్నికృష్ణుడికి అపకారం చేద్దామని ఒక రాక్షసి చనుబాలు ఇచ్చింది; కొండరాళ్ళ మీదకి సుడిగాలి వీచింది; దట్టమైన చెట్లు వాడి మీద పడిపోయాయి. అన్ని అపాయాలూ శ్రీహరి దయవలన తప్పిపోయాయి. ఇంక చాలు ఇప్పటికైనా మరో క్షేమకరమైన ప్రదేశానికి వెళ్ళిపోవడం మంచిది. వింటున్నారా!

10.1-424-క.
కసవు గల దిరవు పసులకు
లస దద్రి నదీ మహీజ లతికావళిఁ బెం
పెసఁగును, గాపురమునకును
బొసఁగును బృందావనంబు పొదఁ డచ్చటికిన్."

టీక:- కసవు = గడ్డి; కలది = ఉన్నట్టి; ఇరవు = చోటు; పసులకు = పశువులకు; లసత్ = చక్కటి, ప్రకాశవంతమైన; అద్రి = కొండలు; నదీ = నదులు; మహీజ = వృక్షములు; లతికా = తీగల; ఆవళిన్ = సమూహములతో; పెంపు = సమృద్ధితో; ఎసగున్ = అతిశయించును; కాపురమున్ = సంసారములు చేయుట; కును = కు; పొసగును = తగి ఉండును; బృందావనంబు = బృందావనము; పొదడు = పదండి పోదాము; అచ్చటి = అక్కడ; కిన్ = కు.

భావము:- అక్కడ బృందావనం అనే ప్రదేశం ఉంది. అక్కడ పశువులకు మేత పుష్కలంగా లభిస్తుంది. అక్కడ విహరించడానికి చక్కని పర్వతాలు నదులూ చెట్లు తీగెలు కలిగి ఎంతో అందంగా ఉంటుంది. అక్కడకి వెళ్ళిపోదాం పదండి."

## బృందావనమునకు బోవుట

10.1-425-వ.
అని పలుకు నుపనందుని పలుకుల కార్యులైన గోపకు "లిదియ కార్యంబు మందల" యని కొందల మందక యాలమందల నమంద గమనంబున ముందఱ నడవం బనిచి పిఱుందం గ్రందుకొనకుండ, బాల వృద్ధ నారు లెక్కిన తేరులు సాగించి తారు తను త్రాణ తూణీర బాణధరులై విండ్లు బట్టుకొని నడవ, బండ్ల వెనుకం గొమ్ము లిమ్ములం బూరించుచు నవార్యంబులగు తూర్యరవంబులు సెలంగ, నార్య, పురోహిత సమేతులై వేడుకలు కొనలునిగుడ మొన లేర్పఱచుకొని పావనం బగు బృందావనంబునకుం జని రప్పుడు.

టీక:- అని = అని; పలుకు = చెప్పెడి; ఉపనందుని = ఉపనందుని యొక్క; పలుకుల్ = మాటల; కున్ = కు; ఆర్యులు = పెద్దలు; ఐన = అయిన; గోపకులు = యాదవులు; ఇదియ = ఇదే; కార్యంబు = మన కర్తవ్యము; మందలన్ = మన ఊరికి; అని = అని; కొందలము = సంకటములు; అందక = పడక; ఆలమందలన్ = పశువుల గుంపును; అమంద = వడిగల; గమనంబులన్ = నడకలతో; ముందఱన్ = ముందు; నడవన్ = నడవవలెనని; బనిచి = పంపించి, నియమించి; పిఱుందన్ = వెనుకనే; క్రందుకొనకుండన్ = సందడిచేయకండ; బాల = చిన్నపిల్లలు; వృద్ధ = ముసలివారు; నారులు = స్త్రీలు; ఎక్కిన = అధిరోహించిన; తేరులు = బండ్లు,

రథములు; సాగించి = నడిపించి; తారు = తాము; తనుత్రాణ = కవచములు; తూణీర = అమ్ములపొదులు; బాణ = అమ్ములు; ధరులు = ధరించినవారు; ఐ = అయ్యి; విండ్లున్ = విల్లులను; పట్టుకొని = చేతులలో పట్టుకొని; నడవన్ = నడుస్తుండగా; బండ్ల = బండ్లు; వెనుకన్ = వెనకాతల; కొమ్ములు = కొమ్ముబూరాలు; ఇమ్ములన్ = గట్టిగా; పూరించుచున్ = ఊదుచు; అనివార్యంబు = అడ్డగింపరానివి; అగు = ఐన; తూర్య = వాద్యముల; రవంబులున్ = ఘోషలు, ధ్వనులు; ఆర్య = పెద్దలు; పురోహిత = పురోహితులు; సమేతులు = కూడినవారు; ఐ = అయ్యి; వేడుకలు = ఉత్సాహములు; కొనలునిగుడన్ = అతిశయించుచుండగా; మొనలు = నాయకులను, బారులు; ఏర్పఱచుకొని = నియమించుకొని, తీర్చి; పావనంబు = పరిశుద్ధమైనది; అగు = ఐన; బందావనంబున్ = బృందావనమున; కున్ = కు; చనిరి = వెళ్ళిరి; అప్పుడు = అప్పుడు.

<u>భావము</u>:- ఉపనందుడిలా చెప్పగానే పెద్దలూ పూజ్యులైన గోపకులు అందరూ అంగీకరించారు ఒక క్రమపద్ధతిలో ముందుగా ఆవుల మందలను వేగంగా బృందావనానికి తోలించారు. వాటికి రక్షగా వెనుకనే వారి బండ్లు బయలుదేరాయి. వాటిలో బాలకులు స్త్రీలు వృద్ధులు పయనించసాగారు. వాటి పక్కనే గోపాలురు కవచాలు, ధనుర్బాణాలు, అమ్ములపొదులు పట్టుకుని బయలుదేరారు. బండ్లకు వెనుకగా బాకాలు తూర్యములు మ్రోగుతూ ఉండగా పూజ్యులైన పురోహితులు వెంట నడువగా పల్లెలోని మిగిలినవారు అందరూ బయలుదేరారు. అలా గుంపులు గుంపులుగా ఈ మొత్తం అంతా ఉత్సాహంతో బృందావనానికి బయలుదేరారు.

## 10.1-426-త.

<u>ప</u>సుపు లాడి యురోజకుంకుమ <u>పం</u>కశోభితలై లస
<u>ద్వ</u>సనలై కచభారచంపక<u>దా</u>మలై సు లలామలై
<u>ప</u>సిఁడిమాడల కాంతు లఖ్ఖులఁ <u>బ</u>ర్వఁ దేరులమీఁద బెం
<u>పె</u>సఁగ బాడిరి వ్రేత లా హరి<u>హే</u>ల లింపగు నేలలన్.

<u>టీక</u>:- పసుపులాడి = పసుపులు రాసుకొని స్నానములు చేసి; ఉరోజ = రొమ్ముల పైన పూసుకొన్న; కుంకుమ = కుంకుమ; పంక = పల్చటి లేహ్యము, పాలుతో; సం = చక్కగా; శోభితలు = ప్రకాశించువారు; ఐ = అయ్యి; లసత్ = అందమైన; వసనలు = వస్త్రములు ధరించినవారు; ఐ = అయ్యి; కచభార = జుట్టుముడులలో; చంపక = సంపెగపూల; దామలు = దండలు కలవారు; ఐ = అయ్యి; సు = చక్కగా; లలామలు = తిలకము ధరించినవారు; ఐ = అయ్యి; పసిడి = బంగారు; మాడల = మాడల యొక్క; కాంతులు = మెరుపులు; అఖ్ఖులన్ = మెడల యందు; పర్వన్ = పరచుకొనుచుండగా; తేరులు = రథములు, బండ్లు; మీదన్ = పైననుండి; పెంపు = ఉత్సాహములు; ఎసగన్ = అతిశయించగా; పాడిరి = పాటలు పాడిరి; వ్రేతలు = గోపికలు; ఆ = ఆ ప్రసిద్ధుడైన; హరి = శ్రీకృష్ణుని; హేలలు = లీలలను; ఇంపగు = మనోజ్ఞమైన;

నేలలన్ = ప్రదేశములలో.

<u>భావము</u>:- గోపికలు చక్కగా పసుపులు రాసుకుని, స్నానాలు చేసి, ఆపైన పాలిండ్ల మీద కుంకుమ పూతలు పూసుకుని, మెరుపుల వస్త్రాలు ధరించారు, అందంగా తిలకాలు దిద్దుకున్నారు. పెద్ద కొప్పులపై సంపెంగ పూలదండలు ధరించారు. ధరించిన బంగారు కాసులపేరు కాంతులు మెడలో ప్రకాశిస్తున్నాయి. వారు బండ్లలో ఎక్కి కూర్చుని చక్కని కంఠాలలతో మాధవుడిమీద పాటలు పాడుతూ ఉన్నారు.

## పూర్ణి



*10.1-1790-క.

కువలయరక్షాతత్పర!
<u>కు</u>వలయదళ నీలవర్ణ <u>కో</u>మలదేహా!
కువలయనాథ శిరోమణి!
<u>కు</u>వలయజన వినుత విమల<u>గు</u>ణ సంఘాతా!

<u>టీక</u>:- కువలయరక్షాతత్పర = శ్రీరామా {కువలయ రక్షా తత్పరుడు - కు (భూమి) వలయ (మండలమును) రక్షా (కాపాడుట యందు) తత్పరుడు (ఆసక్తి కలవాడు), శ్రీరాముడు}; కువలయదళనీలవర్ణకోమలదేహా = శ్రీరామా {కువలయ దళ నీలవర్ణ కోమల దేహుడు - కువలయ (నల్లకలువ) యొక్క దళ (రేకులవంటి) వర్ణ (రంగు కలిగిన) కోమల (మృదువైన) దేహుడు (శరీరము కలవాడు), శ్రీరాముడు}; కువలయనాథశిరోమణి = శ్రీరామా {కువలయనాథ శిరోమణి - కు (భూమి) వలయ(మండలమును) నాథ (ఏలువారిలో) శిరోమణి (తలమీది మణివలె శ్రేష్ఠమైన వాడు), శ్రీరాముడు}; కువలయజనవినుత = శ్రీరామా {కువలయజన వినుత - కువలయ (భూమండలము యొక్క) జన (సర్వ ప్రజలచేత) వినుత (స్తుతింపబడువాడు), శ్రీరాముడ}; విమలగుణసంఘాతా = శ్రీరామా {విమల గుణ సంఘాతుడు - విమల (స్వచ్ఛమైన) గుణ (సుగుణముల) సంఘాత (సమూహములు కలవాడు), శ్రీరాముడు}.

<u>భావము</u>:- భూమండలాన్ని రక్షించటంలో ఆసక్తి కలవాడా! కలువ రేకుల వంటి నల్లని కాంతితో విరాజిల్లే మృదువైన దేహం కలవాడా! భూమండలంలోని భూపతు లందరికి శిరోభూషణ మైన వాడా! పుడమి మీదనుండే జనులందరిచే పొగడబడే సుగుణాల సమూహం కలవాడా! శ్రీ రామచంద్ర ప్రభో! నీకు వందనం.

ఈ శ్రీరాముని ప్రార్థనలోని చమత్కార మాధుర్యం తొణికిసలాడుతోంది. కువలయ అని నాలుగు పాదాలు ఆరంభిస్తు లోకం, కలువలు, రాజులు, మానవులు అని నాలుగు రకాల

అర్థబేధంతో యమకం పండించిన తీరు అద్భుతం. రెండు గాని అంతకంటె ఎక్కువ అక్షరాలు ఉన్న పదాలు, అర్థభేదం కలిగి, మరల మరల వస్తూ ఉంటే యమకాలంకారం.

ఉపాఖ్యానంత గద్యము.

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీమహాభాగతం బను మహాపురాణ దశమ స్కంధం బందంలి గోపికలు కృష్ణుని అల్లరి చెప్పుట, యశోద గోపికల నొడంబరచుట, కృష్ణుడు మన్నుదినె ననుట ననెడి, చిలుకుతున్న కవ్వం పట్టుట, నంద యశోదల పూర్వ జన్మ, యశోద కృష్ణుని అదలించుట అను కథలు కలిగిన "శ్రీకృష్ణలీలలు -2" సమాప్తము అగుట.

***ఓం నమో భగవతే వాసుదేవాయ!!***

***ఓం! ఓం! ఓం!***

***ఓం!***

***శాంతిః! శాంతిః!***

***సర్వే జనా స్సుఖినో భవతు!!***